# విషయసూచిక

## చదువవలసిన గ్రంథాలు:

1. Indian Economy – Its Nature & problems — by Alak Ghosh
2. Indian Economics— by K. K. Dewett
3. The Economics of Indian Agriculture — by B. V. Narayanaswamy & P. S. Narasimhan.
4. Readings in Rural problems— by Dr. V. V. Sayana
5. Agrarian Reforms & Agricultural Reconstruction — by G.D. Agarwal
6. ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికల సంగ్రహపాఠాలు — కేంద్ర ప్రభుత్వ ప్రచురణలు
7. Rural credit Survey Report — Do.
8. ప్రభుత్వ వ్యవసాయ విధానం— నంబూరి ప్రసాదరావు
9. వ్యవసాయ సంస్కరణలు — ఇ.యం.యస్. నంబూద్రిపాద్
10. రెండవ పంచవర్ష ప్రణాళికలో భూసంస్కరణలు — చలసాని వాసుదేవరావు
11. రెండవ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయకూలీలు — తుమ్మెళ్ళ గోవిందయ్య
12. భూకమతాల గరిష్టపరిమితి – భూస్వాముల వాదనలు — చలసాని వాసుదేవరావు
13. Growing Tax Burden on the peasantry — All India Kisan Sabha
14. On the Food problem – Article by Renu Chakravarty in New Age monthly, February, '58.
15. Memorandum on Food – The Communist party of India in New Age Weekly.

# మన ఆర్థిక జీవితంలో వ్యవసాయోత్పత్తి యొక్క పాత్ర

భారతదేశం పారిశ్రామికంగా వెనుకబడిన దేశం గావడం వలన జనాభాలో అధికభాగం వ్యవసాయం పైననే ఆధారపడుతున్నారు. దేశ జనాభాలో 70 శాతం ప్రత్యక్షంగాను, మరొక 15 శాతం పరోక్షంగాను వ్యవసాయం పైన ఆధారపడియున్నారు. పెద్ద పెద్ద పరిశ్రమలలో 100 కి ఒకరు, చిన్న పరిశ్రమలలో నూటికి 5 గురు మాత్రమే బ్రతుకుతున్నారు.

ప్రతి సంవత్సరము దేశంలో సృష్టించబడే సంపదలో సగభాగం వ్యవసాయంనుండే వస్తూంది. రెండవ పంచవర్ష ప్రణాళిక అంత్యానికి కూడా వ్యవసాయంనుండి వచ్చే ఆదాయం మొత్తం జాతీయ ఆదాయంలో 46.3 శాతం వుంటుందని అంచనా వేయబడింది.

ఈనాడు మన దేశపు ప్రజలను ప్రధానంగా పోషించేది వ్యవసాయమే. అయినా మన జనాభా కవసరమైన ఆహార పదార్థాలలో 10 శాతం వరకూ సగటున సంవత్సరానికి దిగుమతి చేసుకోవలసి వస్తూంది.

మనదేశ ప్రజలను పోషించుటలోనే గాక మన ప్రధాన పరిశ్రమలైన బట్టల మిల్లులు, జనపనార మిల్లులు, పంచదార మిల్లులు వగైరాలకు కావలసిన ముడిపదార్థాలను మన వ్యవసాయం ఉత్పత్తి చేయవలసియున్నది. అలాగే రంగులు,

వార్నిష్‌లు వగైరాలకు కావలసిన నూనెగింజలను కూడా పండించవలసి యున్నది.

అంతేగాదు, మన దేశీయ, విదేశీ వ్యాపారంలో వ్యవసాయిక ముడిసరుకులే ప్రధాన పాత్రను నిర్వహిస్తున్నాయి. ముఖ్యంగా విదేశీ వ్యాపారంలో తేయాకు, నూనెగింజలు, పొగాకు, సుగంధ ద్రవ్యాలు వగైరాలు చాలా విలువైన సరుకులుగా ఉంటున్నాయి. ఉదాహరణకు ఒక తేయాకు ఎగుమతుల విలువ 1954 55 వ సంవత్సరంలో రు. 147 కోట్లు ఉన్నది.

మన జాతీయాదాయంతో పాటు మన దేశ, రాష్ట్ర బడ్జెట్లు కూడా ప్రధానంగా వ్యవసాయాదాయాల పైననే ఆధారపడియున్నవి. వ్యవసాయం బాగా అభివృద్ధి అయితే బడ్జెట్ వనరులు కూడా పెంపొందుతాయి.

చివరకు 100 కి 80 మందిగా నున్న మన రైతాంగం యొక్క కొనుగోలుశక్తి పైననే దేశీయ మార్కెట్, మన పరిశ్రమల భవిష్యత్తు ఆధారపడివున్నాయి.

ఒక్కమాటలో చెప్పాలంటే మనదేశం పారిశ్రామికంగా వెనుకబడినందువల్ల అధిక భాగం జనాభాయొక్క బ్రతుకు తెరువు, మన విదేశీవ్యాపారం యొక్క లాభనష్టాలు, మన పరిశ్రమలయొక్క భవిష్యత్తు – అన్నీ మన వ్యవసాయం పైననే చాలావరకు ఆధారపడివున్నాయి.

# ప్రధాన వ్యవసాయోత్పత్తి

మనదేశంలో వ్యవసాయోత్పత్తిలో ప్రధాన భాగం ఆహారధాన్యాల ఉత్పత్తియే. డెన్మార్కు, హాలెండులవలె పాడి పరిశ్రమగాని, ఆస్ట్రేలియా, అర్జెంటైనా, న్యూజీలాండుల వలె మాంసము, ఉన్ని వగైరా ఉత్పత్తిగాని మనదేశంలో పెద్దయెత్తున అభివృద్ధికాలేదు.

ఆహార పదార్థాలు :- వరి అధికభాగం జనాభాకు ప్రధాన ఆహారధాన్యంగా ఉంటుంది. దేశం మొత్తంపైన 7 కోట్ల 44 లక్షల ఎకరాలలో ఇది పండిచబడుతుంది. గోధుమ వరి తర్వాత ప్రధానమైన ఆహార ధాన్యంగా ఉన్నది. 2 కోట్ల 78 లక్షల ఎకరాలలో పండించబడుతుంది. జొన్న, రాగి వగైరాలు 7కోట్ల 37 లక్షల యెకరాలలోను, మొక్కజొన్న 93 లక్షల యెకరాల లోను, పప్పు ధాన్యాలు 5 కోట్ల 52 లక్షల ఎకరాలలోను పండించబడుతున్నాయి. పైన చెప్పిన ప్రధాన ధాన్యాల ఉత్పత్తి వివరాలు యీ క్రింది టేబిల్‌లో యివ్వబడ్డాయి.

(మిలియన్ టన్నులలో)

| సంవత్సరం | వరి | గోధుమ | ఇతరధాన్యాలు | పప్పుధాన్యాలు | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1953–54 | 28 26 | 7.88 | 22.17 | 10.56 | 68.87 |
| 1954–55 | 25 14 | 8.78 | 22.21 | 10 98 | 67.11 |
| 1955–56 | 26.85 | 8.57 | 19 05 | 10.82 | 65.29 |
| 1956–57 | 28.14 | 9.07 | 20.04 | 11.44 | 68.69 |

(ఫుడ్ గ్రెయిన్స్ ఎంక్వైరీ కమిటీ రిపోర్టు నుండి)

ఇవిగాక ప్రధానంగా బీర్ పానీయం తయారుచేయుట కుపయోగించే బార్లీపంట 84 లక్షల ఎకరాలలోను (1955 లో

23 లక్షల టన్నులు పండించబడింది), చెరుకు 40 లక్షల ఎక రాలలోను ( 1955 లో 55 లక్షల టన్నులు పండించబడింది ) పండించబడుతున్నాయి.

వ్యాపార పంటలు :- 1954-55 లో 42 లక్షల 27 వేల బేళ్ళ ప్రత్తి, 29 లక్షల బేళ్ళ జనపనార ఉత్పత్తయ్యాయి. అదే సంవత్సరంలో 2 కోట్ల 60 లక్షల ఎకరాలలో 58 లక్షల 80 వేల టన్నుల వేరుశనగ, అవిసి, అముదం వగైరా నూనెగింజలు ఉత్పత్తయ్యాయి. 8 లక్షల ఎకరాలలో 2 లక్షల 43 వేల టన్నుల పొగాకు పండించబడింది. 6640 లక్షల పౌనుల తేయాకు (1955 లో), 598 లక్షల పౌనుల కాఫీ (1953 లో), 21,136 టన్నుల రబ్బరు (1953 లో) ఉత్పత్తి చేయబడ్డాయి. ఇవిగాక సుగంధ ద్రవ్యాలు, పశుగ్రాసము పండించబడు తున్నాయి.

అయితే యింకా మనదేశంలో ఆహార ధాన్యాల స్వయం సమృద్ధిని సాధించవలసియున్నది. ఆహార కొరతను పూడ్చుకునేందుకు ప్రతి సంవత్సరము కొన్ని లక్షల టన్నుల ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవలసి వస్తూంది. ఉదా హరణకు 1948-49 నుండి 1952-53 సం॥ల మధ్య రు. 703.3 కోట్లు, 1953-54 నుండి 1956-57 ల మధ్య రు. 271.85 కోట్ల విలువగల ఆహార ధాన్యాలు దిగుమతి చేయబడ్డాయి. దీని ఫలితంగా మన విదేశీ ద్రవ్యమారకం చాలావరకు హరించుకు పోతూంది. ఆహార ధాన్యాలతో పాటు మన జౌళి పరిశ్రమల కవసరమైన ముడి ప్రత్తి, జనపనారల విషయంలో కూడా మనకు లోటు చాలా ఉంటూంది. సంవత్సరానికి 18 లక్షల

చేళ్ళ ముడి జనపనారను దిగుమతి చేసుకుంటున్నాము. అలాగే 1955–56 లో రు. 58 కోట్లు, 1956–57 లో రు. 53 కోట్ల విలువగల ముడి ప్రత్తి దిగుమతి చేయబడింది.

తేయాకు, కాఫీ, పొగాకు, సుగంధ ద్రవ్యాలు, నూనె గింజలు మన దేశంనుండి ఎగుమతిచేయబడుతున్నాయి. మన ఎగుమతులలో తేయాకు అగ్రస్థాన మాక్రమిస్తూంది. 1955–56 లో మన తేయాకు ఎగుమతుల విలువ రు. 108.69 కోట్లున్నది. 1954–55 లో రు. 11.12 కోట్ల విలువగల సుగంధ ద్రవ్యాలు, రు. 10.82 కోట్ల విలువగల పొగాకు, 1955–56 లో రు. 4.05 కోట్ల విలువగల నూనెగింజలు ఎగుమతిచేయబడ్డాయి.

# భూ స మ స్య లు

## (PROBLEMS OF LAND)

వ్యవసాయంలో ప్రధానమైన అంశం భూమి. అందువలన వ్యవసాయ వ్యవస్థయొక్క అధ్యయనం భూసమస్యలతో ప్రారంభించడం సముచితంగా ఉంటుంది.

సాగులోనున్న భూమి :- మన భారతదేశంలో మొత్తం భూమి, దానిలో సాగుకు లాయకైనదెంత, ప్రస్తుతం సాగులో నున్న దెంత అనే వివరాలు యీ క్రింది టేబిల్లో యివ్వబడ్డాయి.

(ఉజ్జాయింపున ఎకరాలలో)

| | | | | | |
|---|---|---|---|---|---|
| మొత్తం భూమి | ... | 81 | కోట్ల | 10 | లక్షలు |
| సర్వే అయిన భూమి | ... | 72 | ,, | 20 | ,, |
| అడవులు | ... | 13 | ,, | 30 | ,, |
| మొత్తం సాగుకు లాయకు కానిది | ... | 12 | ,, | 30 | ,, |
| మొత్తం సాగుకు లాయకైనభూమి | ... | 56 | ,, | 70 | ,, |
| పడావులు మినహా సాగుచేయనిది | ... | 9 | ,, | 50 | ,, |
| ప్రస్తుత పడావులు | ... | 2 | ,, | 80 | ,, |
| ఇతరములు | ... | 2 | ,, | 90 | ,, |
| సాగులోనున్న భూమి | ... | 34 | ,, | 30 | ,, |

(రెండవ పంచవర్ష ప్రణాళిక నుండి)

పై లెక్కలను బట్టి ప్రస్తుతం సాగులో లేకపోయినా సాగుకు లాయకైన భూమి యింకా 12 కోట్ల 40 లక్షల ఎకరాలు (467—343=124 మిలియన్లు) ఉన్నదని తేలుతుంది.

సాగుకు లాయకైన భూమి యింత వున్నప్పటికీ అందులో చాలా భూమి పడావుగాను, బంజరుగాను పడియుండుటకు కారణమేమిటి ? దీనికి ప్రధాన కారణం భూమితో ప్రత్యక్ష సంబంధం లేకుండ, కష్టజీవులైన రైతాంగంయొక్క శ్రమ ఫలితాన్ని దోచుకుంటు విలాసాలతో గడుపుతున్న ఫ్యూడల్ ప్రభువులు, భూస్వాములు భూమిపైన యెట్టి శ్రద్ధ చూపించకపోవడమే. దీనితో పాటు కష్టపడి సాగుచేసేవారికి కూడా ప్రభుత్వం తగిన ప్రోత్సాహం యివ్వకపోవడం, రవాణా సౌకర్యాలు లేకపోవడం, నీటి వసతులు కల్పించకపోవడం, కొన్ని ప్రాంతాలు అనారోగ్యకరంగా ఉండడం కూడా విశాలమైన భూములు సాగులోనికి రాకపోవడానికి కారణాలే. వ్యవసాయ సంస్కరణలను సక్రమంగా అమలుజరిపి బీదరైతులకు, భూమి లేని నిరుపేదలకు సహాకారం యిచ్చుట ద్వారాను, నీటి వసతులు కల్పించుట ద్వారాను, ట్రాక్టర్లను వినియోగించుట ద్వారాను, వీటిని సత్వరమే సాగులోనికి తెచ్చేందుకు అవకాశమున్నది. మన ఆహార పరిస్థితిని దృష్టిలో పెట్టుకున్నప్పుడు మన సాగు భూమిని విస్తరింపజేయడం ఎంతైనా అవసరం.

సాగుభూమి విస్తరణకు ప్రభుత్వం కొన్ని పథకాలు వేసింది. ఒక కేంద్ర ట్రాక్టర్ సంస్థను, కొన్ని రాష్ట్రాలలో అనుబంధ ట్రాక్టర్ సంస్థలను నెలకొల్పింది. ఈ ట్రాక్టర్ల ద్వారా మధ్యప్రదేష్, ఉత్తరప్రదేష్, మధ్యభారత, భోపాల్ లలో 1954 ఆగస్టు నాటికి 12 లక్షల 68 వేల ఎకరాల భూమిని సాగులోనికి తీసుకువచ్చినట్లు ప్రభుత్వ లెక్కలు తెలుపుతున్నాయి. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో

రు. 10 కోట్లు కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు మరొక రు. 25 కోట్లు ఖర్చుపెట్టి అదనంగా 74 లక్షల ఎకరాలను సాగులోనికి తేవాలని సంకల్పించాయి. కాని ప్రధానంగా ప్రజల సహకారంతో సాగులోనికి తెచ్చేకృషి లోపించినందువలన యీ పథకం చాలా నెమ్మదిగా అమలుజరుగుతూంది.

భూసార సమస్య :— మన దేశంలో భూసారం క్రమానుగతంగా తగ్గుతూందని ఒక వాదన, తగ్గడం లేదుగాని చాలా తక్కువస్థాయిలో అభివృద్ధికాకుండా అలాగే నిలచిపోయిందని మరొక వాదన ఉన్నది. ఏమైనప్పటికీ యితర దేశాలతో పోల్చినపుడు మనదేశంలో భూసారం చాలా తక్కువగా ఉన్నది. ఎకరానికి సగటున పండే పంట అతి తక్కువస్థాయిలో ఉండిపోయిందని యీ క్రింది టేబిల్‌ను బట్టి మనకు స్పష్టమౌతుంది.

( ఎకరానికి సగటు పంట — పౌనులలో )

| దేశం | వరి | గోధుమ | మొక్కజొన్న | చెరుకు | ప్రత్తి |
|---|---|---|---|---|---|
| భారతదేశం | 916 | 536 | 586 | 29,457 | 80 |
| పాకిస్తాన్ | 12[illegible]6 | 833 | 951 | 17,49[illegible] | 184 |
| బర్మా | 1240 | — | — | — | — |
| * చైనా | 2141 | 874 | 1169 | — | 143 |
| జపాన్ | 3533 | 1638 | 1205 | — | 98 |
| ఇండోనీషియా | 1945 | — | 1388 | 76,[illegible]0 | -- |
| ఈజిప్టు | 2338 | 1680 | 1835 | 63,993 | 428 |
| అమెరికా | 2311 | 949 | 2100 | 39,618 | 274 |
| రష్యా | 1918 | 830 | 955 | — | 285 |

* ఇందులో చైనాను గురించి యివ్వబడిన లెక్కలు పాతవి. ఇటీవల చైనా వ్యవసాయోత్పత్తిలో సాధించిన అద్భుతమైన విజయాలను

మన దేశంలో సగటు ఉత్పత్తి యింత తక్కువగా ఉండుటకు ఒక ముఖ్యకారణం ఎరువుల వాడకం చాలా తక్కువగా ఉండడమే. రైతాంగం యొక్క కొనుగోలు శక్తి చాలా తక్కువగా ఉన్నందువలన ధరలు ఎక్కువగా ఉన్న కృత్రిమ ఎరువులను కొని వాడలేకపోతున్నారు. సహజసిద్ధమైన ప్రకృతి ఎరువులలో ముఖ్యమైన పశువుల పేడను వంటచెరుకు బదులు ఉపయోగిస్తున్నారు. మన దేశంలో 70 శాతం జనాభా వ్యవసాయంపై ఆధారపడుటచే సాగుభూమి అంతటిలోను తిండిగింజలు, వాణిజ్య పంటలు పండించడం జరుగుతూంది. దానితో పచ్చిఎరువులు ఉత్పత్తి చేయ లేకపోతున్నారు. అదే కారణం వలన భూసారాన్ని కాపాడేటటువంటి పైరులు మార్చుతూ వేసే పద్ధతి అమలుజరుగుట లేదు. దీనితో పాటు మన దేశంలోని నత్రజని (నైట్రోజన్) లవణాలు గల నూనెగింజలు, భాస్వరం ఎక్కువగాగల బోన్‌మీల్ (ఎముకలపొడి) కూడా విరివిగా ఎగుమతి చేయబడుతున్నాయి. వీటన్నింటి ఫలితంగా భూసారాన్ని పెంచలేకపోతున్నారు.

భూసారాన్ని క్రమానుగతంగా పెంచుకుంటూ ఎక్కువ పంటలు పండించాలంటే ప్రభుత్వం చౌకగా రసాయనిక ఎరువులు సప్లయి చేయవలసియుంటుంది. అలాగే వంటచెరుకు కూడా లభ్యమయ్యేటట్లు చూడాలి. పచ్చిఎరువుల పెంపకాన్ని ప్రోత్సహించాలి. పట్టణాలలోని చెత్తమట్టి వగైరాలను కంపోస్టు ఎరువుగా వినియోగించాలి. అన్నింటికన్న

పాఠకులు దృష్టిలో ఉంచుకోవాలి. ప్రస్తుత ఉత్పత్తికి సంబంధించిన వివరాలు మరొకచోట యివ్వబడ్డాయి.

ముఖ్యంగా సమగ్ర వ్యవసాయ సంస్కరణల ద్వారా మన వ్యవసాయదారుల కొనుగోలు శక్తిని పెంచవలసి యుంటుంది.

భూసారం తగ్గిపోవుటకు మరొక కారణంకూడా ఉన్నది. భూమియొక్క సారవంతమైన పైపొరలు (ముఖ్యంగా కొండల దిగువనున్న భూములలోను, ఎడారుల ప్రక్కనున్న భూముల లోను) వర్షాలకు, వరదలకు, గాడ్పులకు కొట్టుకొని పోవుట ద్వారా భూసారం తగ్గిపోతూంది. దీనినే "షీట్ ఎరోషన్" అంటారు. కొన్ని చోట్ల వర్షాల మూలంగా భూమి లోతుగా కోసుకుపోయి 'గల్లీలు' తయారై భూవిస్తీర్ణం తగ్గుతూంది. దీనిని 'గల్లీఎరోషన్' అంటారు. ఉదాహరణకు రాజస్థాన్ ఎడారి గాడ్పులద్వారా సంవత్సరానికి 50 చదరపు మైళ్ళ మేరకు సారవంతమైనభూమిని ఇసుక కప్పివేస్తూంది. పంజాబ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో పర్వతాల దిగువనున్న భూము లలో సంవత్సరానికి 80 లక్షల ఎకరాలు కొండ గెడ్డలవలన ఎరోషన్‌కు గురి అవుతున్నాయి. డక్కన్‌లో ఒకప్పుడు ధాన్యాగారమని ప్రసిద్ధిచెందిన బిజాపూర్ జిల్లా యీనాడు నిరంతర కరువుకు గురి యగుటకు కారణమిదే.

భూమి ఎరోషన్ జరగకుండా కాపాడాలంటే పర్వత సానువులలో అడవులను పెంచి రక్షించుట, ఎడారికి సాను భూములకు మధ్య కృత్రిమ అడవులను పెంచుట, వరదనిరోధక చర్యలు తీసుకొనుట, కొండలకు దిగువన కొండగెడ్డలు భూమిని కోసి వేయకుండ రాతి కట్టలు కట్టుట (Bunds & embarkments) వగైరా చర్యలు తీసుకోవలసి యుంటుంది.

ప్రభుత్వం భూసార రక్షణ నిమిత్తం మొదటి పంచ వర్ష ప్రణాళికలో రు. 2 కోట్లు, రెండవ ప్రణాళికలో రు. 25 కోట్లు కేటాయించింది. భూసార రక్షణశాఖ నొకదానిని ఏర్పరచి దాని తరఫున కొంతమంది నిపుణులకు శిక్షణ యిచ్చేందుకు, సమాచారం సేకరించేందుకు సంకల్పించింది. కాని యిప్పటివరకు యీ విషయంలో చేసినకృషి మాత్రం అతిస్వల్పం. అడవుల అభివృద్ధికి మొదటి ప్రణాళికలో రు. 11 కోట్లు. రెండవ ప్రణాళికలో రు. 27 కోట్లు కేటాయించ బడ్డాయి. తొలిప్రణాళిక కాలంలో 75 వేల ఎకరాలలో మాత్రమే అడవులు వేయబడ్డాయి.

పోతే మన దేశంలో కొన్ని ప్రాంతాలలో ఎండుగడ్డ భూములు (Dry Soils), మరికొన్ని ప్రాంతాలలో నిరంతరం మురుగునీరుగల ప్రాంతాలు, కొన్ని ఊసర క్షేత్రాలు ఉన్నాయి. విరివిగా నీటి వసతులు కల్పించుటద్వారా ఎండు గడ్డ భూములను, మురుగునీటి పథకాలద్వారా ముంపు భూములను, లోతుగా దున్నుట, పై పొరలో కొంతభాగం తీసివేయుట, కొన్ని లవణాలను, ఉపయోగించుటద్వారా ఊసర క్షేత్రాలను బాగుచేయవచ్చును. ఈ విషయంలో ప్రభుత్వకృషి చాలా మందకొడిగా నడుస్తూన్నందువలన చెప్పుకోదగిన అభివృద్ధి యింతవరకు జరుగలేదు.

నీటిపారుదలసౌకర్యాలు :- మనదేశంలో అపారమైన నదీ జలాలున్నాయి. కాని వాటిలో కొద్దిభాగం మాత్రమే విని యోగించ బడుతూంది. మిగిలినదంతా సముద్రం పాలవు

తూంది. ఈనాడు దేశం మొత్తంమీద నదీ జలాల విని యోగం యీ క్రింది విధంగా వున్నది.

| | | | |
|---|---|---|---|
| నదీజలాలు మొత్తం | ... | 13,560 లక్షల ఎకరా అడుగులు | |
| వినియోగంలోకి తేగలిగిననీరు | ... | 4,500 ,, | ,, |
| 1951 లో వినియోగించ బడినది | ... | 880 ,, | ,, |

(ఇండియా 1958 సంచి)

దీనినిబట్టి వినియోగంలోనికి తేగలిగిన జలాలలో 19.5 శాతం మాత్రమే 1951 నాటికి వినియోగించ బడుతూంది. రెండవ ప్రణాళిక ఆఖరుకు దీనిని 31 శాతం వరకు పెంచ వచ్చునని అంచనా వేయబడింది.

ఇకనీటి పారుదల సౌకర్యాలు గలభూమి 1948 నాటికి మన దేశంలో మొత్తం సాగుభూమిలో 18 శాతం మాత్రమే. 1948-55 వరకుగల 7 సం॥ లో మరొక 96 లక్షల ఎకరాలకు మాత్రమే నీటి పారుదల సౌకర్యాలు కలిగించబడ్డాయి. మన దేశంలో కాలువలు, చెరువులు, బావులు, యీ మధ్యలో ఏర్పరచిన గొట్టపు బావులద్వారా నీటిపారుదల సౌకర్యాలు కలుగు తున్నాయి. ప్రస్తుతం వీటన్నిటిక్రింద సాగు అవుతున్న భూమి వివరాలు యీ క్రింది టేబిల్‌లో యివ్వబడ్డాయి.

(లక్షల ఎకరాలలో)

| ఆధారం | 1947-48 | 1950-51 | 1955-56 | అభివృద్ధి |
|---|---|---|---|---|
| కాలువలద్వారా | 198 | 207 | 232 | + 34 |
| చెరువులద్వారా | 80 | 88 | 105 | + 25 |
| భావులద్వారా | 125 | 147 | 168 | + 43 |
| ఇతరములు | 64 | 73 | 58 | + 6 |
| మొత్తం | 467 | 515 | 563 | + 96 |

(ఇండియా 1958 సంపు)

నీటిపారుదల సౌకర్యాల నభివృద్ధిచేయుటకు ప్రభుత్వం చేస్తున్న కృషి ఆశించినంతగా ఫలించడంలేదు. ఈ కృషి తాబేలు నడకలో నడుస్తూందని చెప్పాలి.

మొదటి ప్రణాళికలో నీటిపారుదల అభివృద్ధికి రు. 384 కోట్లు (మొత్తం ప్రణాళికా ఖర్చులో 16 . 3 శాతం) కేటాయించ బడింది. రెండవ ప్రణాళికలో 381 కోట్ల రూపాయలు కేటాయించబడింది. మొదటి ప్రణాళికలో అదనంగా నీటి పారుదల సౌకర్యాలు కలిగించిన 96 లక్షల ఎకరాలుగాక రెండవ ప్రణాళిక ఆఖరుకు మరొక 120 లక్షల ఎకరాలకు యీ సౌకర్యం కలుగ జేయాలని ప్రభుత్వ సంకల్పం. ఈ డబ్బుతో ప్రభుత్వం మొదటి ప్రణాళికలో 110 వరకు పెద్ద, మధ్యరకపు, చిన్న నీటి పారుదల పథకాలను ప్రారంభించింది. వీటిలో 6 బహుళార్థ సాధక పథకాలు. మొదటి ప్రణాళికలో పూర్తిగాని పథకాలను రెండవ ప్రణాళికలో పూర్తిచేయ డానికి, మరికొన్ని కొత్తవి ప్రారంభిచడానికి తలపెట్టింది. ఇప్పటి వరకు పూర్తిచేసిన లేక ప్రారంభించిన పథకాలలో కొన్ని ముఖ్యమైనవాటి వివరాలు యీ దిగువ టేబిల్‌లో యివ్వబడ్డాయి.

కొన్ని ముఖ్య పథకాలు — వాటిక్రింద సాగుకాగలభూమి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. భాక్రా - నంగల్ బహుళార్థ సాధక ప్రాజెక్టు. | | 57 | లక్షల | ఎకరాలు |
| 2. దామోదర్ వాలీ | ,, | 13 | ,, 25వేల | ,, |
| 3. మహానదివాలీ | ,, | 2 | ,, 50వేల | ,, |
| 4. తుంగభద్ర ప్రాజెక్టు | ,, | 7 | ,, | ,, |
| 5. చాంబల్ ప్రాజెక్టు | ,, | 12 | ,, | ,, |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 6. మయూరాక్షి ప్రాజెక్టు | | ,, | 6 | లక్షల | ఎకరాలు |
| 7. కోసీ | ,, | ,, | 16 | ,, | ,, |
| 8. కాకర్‌పార్ | ,, | ,, | 6 | ,, 50 వేల | ,, |
| 9. భద్రా రిజర్వాయర్ | | ,, | 2 | ,, | ,, |
| 10. నాగార్జునసాగర్ | | ,, | 35 | ,, | ,, |

మొత్తంమీద యివన్నీ పూర్తిగా నిర్మించబడిన తరువాత ప్రభుత్వ అంచనాల ప్రకారం మొదటి, రెండవ ప్రణాళికల కాలంలో అన్నిరకాల నీటి పారుదల పథకాల ద్వారా అదనంగా సౌకర్యాలు పొందగల భూమి 5 కోట్ల 20 లక్షల ఎకరాలని చెప్పబడింది. కాని అనుభవంలో యింతవరకు సాధించడం దుర్లభమని తేలుతుంది. మొదటి ప్రణాళికా కాలంలో కోటీ 60 లక్షల ఎకరాల లక్ష్యానికి గాను 60 లక్షల ఎకరాలకు మాత్రమే నీటి పారుదల సౌకర్యం కలిగించబడింది.

ఈవిధంగా కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టినా సత్వరాభివృద్ధిని సాధించలేకపోవుటకు ప్రధాన కారణాలు ఏమిటో పరిశీలించాలి. మొదటి కారణం, భూసంస్కరణలు సక్రమంగా దున్నేవానికే భూమి లభించే పద్ధతిలో అమలు జరుగనందువలన యీ ప్రాజెక్టుల నిర్మాణంలో ప్రభుత్వం రైతాంగంయొక్క సహకారాన్ని సంపాదించలేకపోయింది. రెండవది, ప్రాజెక్టుల నిర్మాణాలతోపాటు కాలువల నిర్మాణం పూర్తిచేయకపోవడంవలన, పూర్తిగా నిర్మాణమైన ప్రాజెక్టులు కూడ వినియోగంలోకి రాకుండా పోయాయి. మూడు, వీటి నిర్మాణంలో డబ్బు దుబారాగా ఖర్చుపెట్టుట, దుర్వినియోగం చేయబడుట వలన ఖర్చు ఎక్కువైనా ఫలితం తక్కువే కలిగింది. నాలుగు, తక్కువఖర్చుతో త్వరగా వినియోగం

లోకి రాగల చిన్న, మధ్య తరగతి ప్రాజెక్టులనూ, పెద్ద పెద్ద ప్రాజెక్టులనూ నిర్మించుటలో తగు సమన్వయం లోపించుట వలన సత్వర ఫలితాలు లేకుండాపోయాయి.

ఇచట నీటిపారుదల సౌకర్యాల నభివృద్ధి చేయుటలో చైనాదేశం సాధించిన మహత్తర విజయాన్ని ఉల్లేఖించడం అప్రస్తుతం గాదనుకుంటాను. మనదేశంలో వలెనే చైనాలో కూడా 1949 లో ప్రజా రిపబ్లిక్ ఏర్పడేనాటికి మొత్తం సాగు భూమిలో నీటివసతులు గల భూమి 15 శాతం మించి లేదు. (మనకు కూడా 1950 నాటికి 18 శాతం ఉండేది). గత సంవత్సరం సెప్టెంబర్ నాటికి చైనాలో పల్లపు సాగుభూమి మొత్తం సాగుభూమిలో 31% అయింది. ఈ సంవత్సరం చైనాలో అదనంగా 3 కోట్ల 60 లక్షల హెక్టార్ల భూమి, అంటే 8 కోట్ల ఎకరాలు పల్లపు సాగులోనికి తేబడింది. దానితో యీనాడు చైనాలో పల్లపుసాగు మొత్తంసాగులో 59% కు చేరుకున్నది. కాని మనదేశంలో ప్రభుత్వ అంచనాల ప్రకారం—ఆ అంచనాలన్నీ అమలుజరిగితే—రెండవ ప్రణాళిక ఆఖరుకు 1950 నాటికున్న 515 లక్షల ఎకరాల పల్లపుసాగుకు మరొక 530 లక్షల ఎకరాలు కలుస్తుంది. అంటే దాదాపు రెట్టింపు అయ్యే అవకాశమున్నది. 11 సంవత్సరాలలో మనదేశంలో సాధింపబోయేది పల్లపు సాగు 530 లక్షల ఎకరాలైతే, చైనాలో 8 కోట్ల ఎకరాలు ఒక్క సంవత్సరంలో సాధించబడింది.

ఇది ఎలా సాధ్యమయింది? దేశవ్యాపితంగా యిందుకు బ్రహ్మాండమైన ఉద్యమం ప్రారంభించబడింది. మురుగునీటి

పారుదల సౌకర్యాలు, నీటి ప్రవాహంవల్ల భూమి కోతపడకుండా నివారించడం, అనావృష్టి సంభవించినప్పుడు సాగు నివారణోపాయాలు చూడడం, పెద్ద ప్రాజెక్టులతో పాటు చిన్న చిన్న స్కీములపై ఎక్కువ కేంద్రీకరించడం, ఆఖరుకు మూల మూలనున్న కొండవాగులను సహితం వినియోగించుకోవడం వగైరా చర్యల ద్వారా యింకా భూమికి నీటి వసతులు కల్పించడం సాధ్యమయింది. ఈ కర్తవ్యాల నిర్వహణలో చైనా రైతాంగం కనీ విని ఎరుగని విధంగా చొరవ, విజ్ఞత, వేగం చూపింది. వారిలో ఉత్సాహం వెల్లివిరిసింది. దీనికంతకూ ప్రధాన కారణం చైనాలో ప్రజాప్రభుత్వ మేర్పడ్డ వెంటనే దేశ వ్యాపితంగా భూమిలేని పేదలందరికీ ఉచితంగా భూమి లభించేటట్లు సమగ్రమైన వ్యవసాయ సంస్కరణలను అమలు జరపడమే.

# భూ సంస్కరణలు

స్వాతంత్ర్యానికి పూర్వం మనదేశంలో ప్రధానంగా మూడు రకాలైనభూమి యాజమాన్యపు పద్ధతులున్నాయి.

జమీందారీ విధానం :- ఈ విధానంలో జమీందార్లు కొన్ని రాష్ట్రాలలో భూమికి యజమానులుగాను, మరికొన్ని రాష్ట్రాలలో రైతులనుండి శిస్తు వసూలుచేసే అధికారులుగాను గుర్తింప బడ్డారు. రెండు సందర్భాల్లోను, ప్రభుత్వానికి శిస్తు వీరే చెల్లించేవారు. జమీందారీవిధానంలో పర్మనెంట్ సెటిల్ మెంటని, (శాశ్వత శిస్తు నిర్ణయం జరిగినవి) టెంపరరీ సెటిల్ మెంటని (40 సం॥ కొకసారి శిస్తు పునఃపరిశీలించబడేవి) రెండు రకాలున్నాయి. ఈ విధానం ప్రధానంగా పశ్చిమ బెంగాల్, బీహార్, ఆంధ్ర, తమిళనాడులో ఉత్తరజిల్లాలు, ఉత్తరప్రదేష్ మధ్య ప్రదేష్‌లలో కొన్ని భాగాలలోనూ ఉండేది. అలాగే పూర్వపు సంస్థానాలలో జాగీర్‌దారీ, మాల్‌గుజారీ, బిస్వే దారీ అనే పేర్లతో ఉంటూండేది.

మహల్వారీ విధానం :- దీని ప్రకారం ఒక గ్రామంలోని రైతులు వ్యక్తిగతంగా ఎవరి భూమిని వారు సాగుచేసు కుంటున్నా ప్రభుత్వ శిస్తుకు సంబంధించి గ్రామమంతా ఒకే ఒక యూనిట్‌గా ఉంటుంది. ఈవిధానం ప్రధానంగా పంజాబ్ మధ్యప్రదేష్, ఉత్తర ప్రదేష్‌లోని ఆగ్రా జిల్లాలో ఎక్కు వగా ఉండేది.

రైత్వారీ విధానం :- దీనిలో ఏ రైతు కారైతు వ్యక్తిగత రిజిష్టర్డు పట్టాదారుగా ఉంటాడు. ప్రభుత్వానికి నేరుగా శిస్తు చెల్లిస్తాడు. పైన చెప్పిన ప్రదేశాలుగాక మిగిలిన భారత దేశంలో యీ విధానం ఉన్నది.

భూమి కేంద్రీకరణ :- మన దేశంలో 100 కి 70 మంది ప్రత్యక్షంగాను, 15 మంది పరోక్షంగాను వ్యవసాయంపైన ఆధార పడుతున్నారని పైన వివరించబడింది. కాని ఉన్న భూమికూడా కొద్దిమంది భూస్వాముల చేతులలో కేంద్రీకరించబడి యున్నది. నేషనల్ శాంపుల్ సర్వేరిపోర్టు ప్రకారం మన దేశంలో ఒక్క సెంటు భూమికూడా లేనివారు 100 కి 22 కుటుంబాలున్నాయి. 5 ఎకరాలలోపు భూమిగలిగిన 100 కి 75 కుటుంబాలకు యాజమాన్యంలో వున్న మొత్తం భూమిలో 100 కి 16 వంతులు మాత్రమే ఉన్నది. 25 ఎకరాలపైన భూమిగల 100కి 3 కుటుంబాలకు మొత్తం భూమిలో 100 కి 37 వంతుల భూమి ఉన్నది. ఈవిధంగా భూమి కొద్ది మంది చేతులలో కేంద్రీకరింపబడి యుండుటవలన మిగిలిన అధికభాగం వ్యవసాయంమీద ఆధారపడే జనాభా భూమి లేని వ్యవసాయ కూలీలుగానో, కౌలుదారులుగానో, బీద రైతాంగంగానో ఉండి నిత్యం కరువు దారిద్ర్యాలతో బాధ పడుతున్నారు.

## వ్యవసాయ సంస్కరణలు - వాటిప్రాముఖ్యత :

మన దేశంలోనున్న భూసంబంధాలే మన వ్యవసాయం ఎదుగు బొదుగు లేకుండా నిస్తబ్ధతలో ఉండుటకు (Stagnant)

ప్రధానకారణం. ఒకవైపు భూమిపైన యాజమాన్యపు హక్కు కలిగి, భూమితో ఎట్టి సంబంధము లేకుండ, కౌలుశిస్తు వసూలు చేసుకుంటూ విలాసాలతో ఖులాసాగా కాలంగడిపే జమీందారులు, భూస్వాములు – రెండవవైపున సంవత్సరమంతా రెక్కలు ముక్కలయ్యేటట్లు కష్టపడి దున్ని పండించినా తమశ్రమ ఫలితం దక్కక తిండికకూడా జరగని కోట్లాది వ్యవసాయ కూలీలు, కౌలుదారులు, బీదరైతులు – యివి మన వ్యావసాయిక వ్యవస్థలోనున్న ఆర్థిక, సాంఘిక, వర్గ సంబంధాలు. ఈసంబంధాలను రద్దుచేసి దున్నేవానికే భూమిని పంచిపెట్టుట వలన మన దేశంయొక్క సత్వర ఆర్థికాభివృద్ధికి అవసరమైనపారిశ్రామిక, సాంఘిక పునాది యేర్పడుతుంది. అలా చేసిననాడు యీ క్రింది ఫలితాలను సాధించ వీలవుతుంది.

1. గ్రామ సీమలలోని ఆర్థిక వ్యత్యాసాలను తొలగించి నూతన జాతీయార్థిక వ్యవస్థకు పునాది వేయబడుతుంది. 2. కోట్లకొలది గ్రామ సీమలలోని నిరుద్యోగులకు వృత్తిని, భుక్తిని కల్పించ వీలవుతుంది. 3. భూమిపైన, దానితో తాముచేసే ఉత్పత్తిపైన పూర్తి హక్కు భుక్తాలు గలిగిన రైతాంగం చొరవతోను, శ్రద్ధతోను వ్యవసాయోత్పత్తిని పెంచేందుకు దోహదం చేస్తుంది. ఫలితంగా ఆహార కొరత తీరుతుంది. ఆహార దిగుమతులు అవసరం లేకుండా స్వయం సమృద్ధిని సాధించుకొను వీలవుతుంది 4. మన పారిశ్రామికోత్పత్తి కవసరమైన ముడిపదార్థాల ఉత్పత్తిని (ముడి జనుము, ముడి ప్రత్తి, నూనెగింజలు వగైరా) పెంచుటకు, మన ఎగు

మతుల కవసరమైన సరుకుల నెక్కువగా ఉత్పత్తి చేయుటకు తోడ్పడుతుంది. 5. 100 కి 80 మందిగానున్న గ్రామ ప్రజల కొనుగోలు శక్తిని పెంచుకుని, తద్వారా మన పారిశ్రామిక వస్తువులకు విస్తృతమైన దేశీయ మార్కెటును సాధించవచ్చు. ఫలితంగా మన పరిశ్రమల అభివృద్ధీ, విస్తరణ నిరాటంకంగా సాగుతాయి. 6. మన జాతీయాభివృద్ధి ప్రణాళికల కవసరమైన ఆర్థిక వనరులను పెంపొందించు కొనుటకుకూడా, సంతృప్తి పొందిన రైతాంగంనుండి యెక్కువ సహాయ సహకారాలు లభిస్తాయి. 7. దేశప్రజల సాంస్కృతిక విజ్ఞానాభివృద్ధికి అవకాశ మేర్పడుతుంది. ఈ విధంగా వ్యవసాయ సంస్కరణలు పారిశ్రామికంగా వెనుకబడిన మన దేశంలో అత్యవసరమైన ఆర్థిక, సాంఘిక విప్లవానికి కీలకంగాను, నాందిగాను పనిచేస్తాయి.

వ్యవసాయ సంస్కరణల ప్రాముఖ్యతను అన్ని పార్టీలూ గుర్తించాయి. కాని వచ్చిన చిక్కంతా, వాటిని ఆచరణలో పెట్టుటలో పాలకవర్గం విఫలమవుతూంది.

మొదటి, రెండవ పంచవర్ష ప్రణాళికలలో భూసంస్కరణల ప్రాధాన్యతను గుర్తించడం జరిగింది. మొదటి ప్రణాళికలో యిలా వ్రాయబడింది.

"భూమిపై యాజమాన్యం ఎవరిది? భూమి ఏ పద్ధతులద్వారా సాగుచేయ బడుతోంది? అన్న విషయాలు గ్రామాల్లోని సాంఘిక, ఆర్థిక వ్యవస్థయొక్క స్వరూపాన్ని నిర్ణయిస్తాయి.

"భూమిపై యాజమాన్యం, వ్యవసాయ సాగుపద్ధతులు భవిష్యత్తులో యెలా రూపొందించ బడతాయా అన్న సమస్యయే జాతీయాభివృద్ధి కార్యక్రమంలో అతి ప్రధాన సమస్యగా ఉంది. భూసమస్య యెలా పరిష్కరింప బడుతుందా అన్న విషయంపై చాలావరకు దేశంలో సాంఘిక, ఆర్థిక వ్యవస్థ రూపు రేఖలు ఆధారపడి ఉంటాయి. భూసమస్యా పరిష్కారానికి అనుసరించే పంథా, దృష్టిపథంలో ఉంచుకునే లక్ష్యాలూ, తప్పనిసరిగా యితర రంగాలపై తమ ప్రభావాన్ని ప్రసరించుతాయి."

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయోత్పత్తిని అధికంచేయడం, పలురకాల వ్యవసాయ పంటలను పండించడం, గ్రామాలలోని ఆర్థిక తారతమ్యాలను తగ్గించడం, గ్రామీణ ప్రజలలోని అన్ని తరగతుల వారికి సమానావకాశాలను కల్పించి, సమాన హోదాలను చేకూర్చడం—వీటిని వ్యవసాయ రంగంలో ప్రధాన లక్ష్యాలుగా పెట్టుకోవాలని ప్రణాళికా సంఘం తెల్పింది. ఈ ఆశయాలను సాధించేందుకు ష్టాట్యూటరీ భూస్వామిక పద్ధతిని రద్దుచేయాలని, కౌలుదారుల హక్కులను రక్షించాలని, భూకమతాపై గరిష్ట పరిమితిని నిర్ణయించేందుకు అవసరమైన భూకమతాల భోగట్టాను సేకరించడం, చిన్న చిన్న క్షేత్రాలను ఏక ఖండాలుగా చేయాలనీ, సహకార వ్యవసాయపద్ధతిని ప్రోత్సహించాలని సిఫారసు చేసింది.

మొదటి ప్రణాళికా కాలంలో యీ సూచనలు సక్రమంగా అమలు జరుగలేదుకాని రెండవ ప్రణాళికా కాలంలో

'భూసంస్కరణలు, వ్యవసాయ పునర్వ్యవస్థీకరణము' అనే అధ్యాయంలో యిలా వ్రాయబడింది.

"భూ సంస్కరణల ద్వారా సాధించవలసిన ముఖ్య లక్ష్యాలు రెండు: మొదటిది, వ్యవసాయోత్పత్తుల పెరుగుదలకు ప్రస్తుతం ప్రతిబంధకాలుగా పనిచేస్తూవున్న పరిస్థితులను తొలగించడం; రెండవది, వ్యవసాయ ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించి వ్యవసాయ నిర్వహణ సమర్థముగా జరిగి, తద్వారా ఉత్పత్తులు యితోధికమగునట్లు తగిన పరిస్థితులను కల్పించడం. ఈ రెండు లక్ష్యములు అవినాభావ సంబంధము గలవి. ఈ లక్ష్యములను సాధించడానికి, దళారీ పద్ధతిని రద్దుచేయడం, సక్రమమైన కౌలుదారీ సంస్కరణలను ప్రవేశపెట్టడం, కమతాలకు పరిమితి నిర్దేశించడం మొదలగు చర్యలను తీసుకోవలసి యుంటుంది. వ్యవసాయ వ్యవస్థను పటిష్టంచేసి, ప్రస్తుతమున్న వ్యత్యాసాలను సాధ్యమైనంతవరకు తగ్గించుటకీ చర్యలను తీసుకోవడం యెంతైనా అవసరం"

ప్రణాళికలలో ప్రకటించబడిన యీ ఆశయాలు ఎంతవరకు అమలుజరుపబడ్డాయో చూడవలసియున్నది.

## స్టాట్యూటరీ భూస్వామ్య విధానం రద్దు

దాదాపు అన్ని రాష్ట్రాలలోను జమీందారీ, జాగీర్దారీ, యినాందారీ విధానాల రద్దు చట్టాలు తేబడ్డాయి. దాదాపు దేశమంతటా యివి అమలు జరుపబడినట్లే. ప్రభుత్వం ప్రకటించిన లెక్కల ప్రకారం గతంలో మొత్తం భూమిలో 43% భూమి జమీందారీల క్రింద ఉండేది. వీటిని రద్దు

చేయడం ద్వారా దీనిలో 91.5% భూమిని ప్రభుత్వం యీనాటికి స్వాధీనం చేసుకుంది. జమీందారుల చేతులలో యింకా 8.5% భూమి ఉన్నది. వివరాలు యీ క్రింద యివ్వబడ్డాయి. (ఇండియా 1958 నుండి)

| | లక్షల ఎకరాలలో | మొత్తం భూమిలో శాతం |
|---|---|---|
| 1. మొదట జమీందారుల చేతులలో ఉన్న భూమి | 34.38 | 43 |
| 2. జమీందారీ రద్దు చట్టాల ద్వారా వారి నుండి తీసుకోదగు భూమి | 32.23 | 40 |
| 3. ఇప్పటికి వారినుండి స్వాధీనం చేసుకున్న భూమి | 30.60 | 38 |
| 4. ఇంకా వారి చేతులలోనున్న భూమి | 3.78 | 5 |

## జమీందారీ విధానం రద్దువలన కలిగిన పరిణామాలు :-

పైనచెప్పినట్లు జమీందారుల చేతులలోనున్న 32 కోట్ల 23 లక్షల ఎకరాల భూమి స్వాధీనంచేసుకోవడంతో గ్రామీణ వ్యవస్థలో కొన్ని మార్పులు వచ్చాయి. ఎస్టేట్లు రద్దుగావడంతో దేశమంతటా ఒకేవిధమైన భూమిశిస్తు విధానం, రైతువారీ పద్ధతి అమలులోకి వస్తుంది. అడవులు, డొంకలు, పుంతలు, గ్రామ సాముదాయక భూములు, నీటిపారుదల వసతులు మున్నగు గ్రామీణ కీలక స్థానాలపైన యీ స్టాట్యూటరీ

భూస్వాములకు యింతకు ముందున్న పెత్తనం తొలగిపోవడం ఫలితంగానూ, యింతకు ముందు ఏ జిరాయితీ హక్కులు కూడ లేనట్టి రైతాంగం (ముఖ్యంగా ఉత్తర ప్రదేష్, బీహారు, పశ్చిమబెంగాలు మున్నగు పూర్తి జమీందారీ ప్రాంతాలలో) యిప్పుడు పూర్తి జిరాయితీ హక్కులను పొందుటవలననూ, (యిట్టి జిరాయితీ హక్కులు ఆంధ్రరాష్ట్రంలో 1908 లోనే ఎస్టేట్‌లాండ్ ఆక్టు ద్వారా లభించాయని గమనించాలి) గ్రామ సాంఘిక, ఆర్థిక జీవితం పైన యీ దోపిడీ వర్గాలకు యింతకు ముందున్న ప్రాబల్యం, ఆధిపత్యం చాలావరకు సడలిపోయాయి.

అయితే ప్రజాస్వామికోద్యమం వ్యతిరేకించినప్పటికి జమీందారులు వగైరాలకు ప్రభుత్వం కోట్లకొలది రూపాయలు నష్టపరిహారం క్రింద యీ క్రింది టేబిల్‌లో వివరించినట్లు చెల్లించ పూనుకున్నది.

| | | |
|---|---|---|
| నష్టపరిహారం క్రింద | ... | 379.14 కోట్ల రూపాయలు |
| వారి పునరావాసానికి | ... | 85.64 ,, ,, |
| నష్టపరిహారంపైన వడ్డీ | ... | 150.00 ,, ,, |
| | మొత్తం | 614.78 కోట్ల రూపాయలు |

దీనిలో యిప్పటికి రు. 61.10 కోట్లు చెల్లించబడింది. ఈ డబ్బు వాయిదాలపై భూములు పొందిన రైతులనుండి వసూలుచేయబడుతూంది. ఇంత పెద్ద మొత్తం నష్టపరిహారంతో పాటు స్వంత కమతం, ఖాస్ సేరీ ఖుద్‌ఖాస్త్ భూముల పేరిట లక్షలాది ఎకరాల నాణ్యమైన భూమిని జమీందార్లు,

జాగీర్దార్ల స్వంతఆస్తులుగా అట్టిపెట్టుకో నిచ్చారు. అలాగే యింతకు ముందు స్వంత కమతాలంటూ ఏమీ లేని జమీందారులకు కూడా, రాజస్థాన్, సౌరాష్ట్ర ముII రాష్ట్రాలలో సారవంతమైన భూములను స్వంత కమతం పేర కట్టబెట్టడాన్ని, కొన్ని చోట్ల రైతుల స్వాధీనంలో నున్న సాగు భూములను, సాముదాయక భూములను యీ చట్టాలు రాక ముందు అమ్ముకున్నా, అన్యాక్రాంతం చేసినా వారికి యీ చట్టాలు అనుమతించాయి. ఈవిధంగా జమీందారులకు నష్టపరిహారం చెల్లించుట ద్వారానూ, స్వంత కమతాల పేరట్లో భూములు అట్టిపెట్టుట ద్వారాను వారిని పెట్టుబడిదారులుగను, పెట్టుబడిదారీ భూస్వాములుగాను తయారుచేసేందుకు పునాదులు వేయబడ్డాయి. వారియొక్క ఆర్థికశక్తి కూడా పూర్తిగా కుంటుపడకుండా నిలబెట్టబడింది.

భూములు సాగుదారులకు స్వాధీనం చేసిన చోట్ల పెట్టుబడిదారీ వ్యక్తిగత ఉత్పత్తికి పునాదిగా ఉండే అనేక లక్షల మంది స్వతంత్రులైన రైతాంగం పెంపొందిందన్న విషయాన్ని కూడా గమనించాలి.

సంస్థానాధీశులకు, జమీందారులకు పూర్వం కౌలు రూపంలో పోయే శిస్తులో అధికభాగం ప్రభుత్వానికి చేరుతూండడం వలన ప్రభుత్వ ఆదాయం పెరిగింది. రైతాంగానికి సంబంధించినంతవరకు కొన్ని చోట్ల శిస్తులో తగ్గినా కొన్ని చోట్ల పెరిగింది. సర్వే సెటిల్‌మెంట్లు లేనందువలన నిరంకుశ ప్రభుత్వోద్యోగస్థుల చిత్తానుసారం శిస్తు వసూళ్ళు కొనసాగుతూనే ఉన్నాయి.

# కౌలుదారీ చట్టాలు

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో యీ క్రింది సూచనల నాధారము చేసుకుని కౌల్దారీ చట్టాలు తేవాలని చెప్పబడింది. 1. కౌలుదార్లు భూస్వాములకు చెల్లించే శిస్తు మొత్తం పంటలో $\frac{1}{4}$ - $\frac{1}{5}$ వంతు మించకూడదు. 2. ప్రస్తుతం సాగుచేస్తున్న కౌలుదార్లకు తాము సాగుచేసే భూమిపైన (భూస్వాముల స్వంతసాగుకు వదలివేసినది పోగా) యాజమాన్యపు హక్కు యివ్వాలి. 3. భూస్వాముల స్వంతసేద్యానికి వదలివేయబడిన భూమి పోగా మిగిలిన భూమిని కౌలుదారు కొనుక్కునే హక్కు యివ్వాలి. 4. భవిష్యత్తులో సాధారణంగా 5 - 10 సం॥కు మించి కౌల్లు వ్రాసుకోదలచుకుంటేనే తప్ప భూమి తిరిగితీసుకో వీలు లేదు. భూస్వాములు స్వయంగా సాగుచేయదలచుకున్న భూములపైన 5 సం॥ల లోపుగా హక్కును సంపాదించుకోవాలి. లేనియెడల ఆభూమిని కౌలుదారు కొనుక్కునే హక్కు ఉంటుంది.

ఈ సూచనల నాధారంచేసుకుని కొన్ని రాష్ట్రాలలో కౌలుదారీ చట్టాలు చేయబడ్డాయి.

కౌలు తగ్గింపు చట్టాలు :- వివిధ రాష్ట్రాలలో వివిధ రకాలుగా చేయబడ్డాయి. కౌలుదారులు భూస్వాములకు చెల్లించే శిస్తు $\frac{1}{3}$ వ వంతుకు మించరాదని పంజాబులో, $\frac{1}{4}$ లేక $\frac{1}{5}$ వ వంతుకు మించరాదని హైదరాబాద్‌లో, $\frac{1}{6}$ వ వంతుకు మించరాదని రాజస్థాన్, బొంబాయిలలో, $\frac{1}{4}$ వ వంతుకు మించరాదని బీహారులో, $\frac{1}{2}$ వ వంతుకు మించరాదని ఆంధ్రలో

చట్టాలు తేబడ్డాయి. ప్రణాళికా సంఘం ¼ – ⅙ వ వంతుకు మించరాదని చేసిన సూచన గాలికిపోయింది.

కౌలుదారీ రక్షణ చట్టాలు :- భూస్వాముల స్వంతసేద్యానికి తిరిగి తీసుకోగల భూమిని మినహాయించి మిగిలిన భూములలో శిస్తు సక్రమంగా చెల్లిస్తున్నంతకాలము కౌలుదారులను తొలగించకూడదని బొంబాయి, హైద్రాబాద్, పంజాబ్, పెప్సూ, సౌరాష్ట్ర, హిమాచల ప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలో బీరార్ ప్రాంతం, మలబార్, ఆంధ్ర ప్రాంతాలలో చట్టాలు చేయబడ్డాయి. కౌలుదారులను తొలగించకుండా పంజాబు, మద్రాసులలో 5 సం॥లు, బొంబాయి, హైదరాబాద్‌లలో 10 సం॥లు, ఆంధ్రలో 6 సం॥లు రక్షణ యివ్వబడింది.

సాగుభూములను కౌలుదార్లు కొనుక్కునే హక్కు :- భూస్వామికి స్వంతసేద్యం కోసం వుంచుకొనే గరిష్ఠ పరిమితి వరకు భూమి వదలి మిగిలిన భూమిని కౌలుదారులు ప్రభుత్వం నిర్ణయించిన రేటు ప్రకారం (ఈ రేటు వివిధ రాష్ట్రాలలో వేరు వేరుగా ఉన్నది.) కొనుక్కోవచ్చునని బొంబాయి, హైదరాబాద్, పంజాబ్, పెప్సూ, సౌరాష్ట్ర, హిమాచల్‌ప్రదేశ్, కచ్, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, రాజస్థాన్‌లలో చట్టాలు తేబడ్డాయి.

ఈ చట్టాల ప్రకారం కేంద్ర ప్రభుత్వం (ఇండియా – 1958 అనే పుస్తకంలో) ప్రకటించిన లెక్కలను బట్టి 7 కోట్ల 30 లక్షల ఎకరాల భూమిలో కౌలుదారులకు పూర్తి రక్షణ యివ్వబడిందనీ, 15 కోట్ల 60 లక్షల ఎకరాల భూమిలో తాత్కాలిక రక్షణ యివ్వబడిందనీ, అసలు ఎట్టి రక్షణా

లేకుండా మిగిలినది 9 కోట్ల 97 లక్షల ఎకరాలేనని చెప్పబడు తూంది. కాని యిది కేవలం అంకెలగారడీగా కనబడుతుంది. లక్షలాది కౌలుదారులు యీ చట్టాలు చేయకముందు, చేసిన అనంతరం కూడా తొలగించబడ్డారనేది జగద్విదితం.

కౌలుదారీ చట్టాలు అమలుజరిగిన తీరు :- ఈ చట్టాలన్నీ అ నుండి క్ష వరకు చాలా లోపభూయిష్టంగా ఉన్నాయి.

మొదటిది : కౌలుదారు నిర్వచనం సక్రమంగా లేదు. బెంగాల్‌లోని షేర్ క్రాపర్లూ, తమిళనాడులోని వరందారులూ, ఉత్తరప్రదేశ్‌లోని హాల్‌వహాలు కౌలుదారులుగా పరిగణింప బడలేదు. వీరి నందరిని భూములలోనుండి వెళ్ళగొట్టేందుకు యీ చట్టాలు చాల అవకాశం యిచ్చాయి. అలాగే కొంత మంది కౌలుదారులను తమ పాలేరులుగా మార్చేసి మోసం చేసేందుకు భూస్వాములకు అవకాశం యివ్వబడింది.

రెండవది : స్వంత సాగు అనే పద నిర్వచనంలోని అస్పష్టతను కూడా భూస్వాములు బాగా ఉపయోగించు కున్నారు. కుటుంబంలోని సభ్యులెవరూ స్వయంగా కష్టం చేయక పోయినా కూలీలను, పాలేళ్ళను పెట్టి మేనేజిమెంటు చేసుకుంటూ వ్యవసాయాన్ని సాగించడంకూడ స్వంత సేద్యం గానే నిర్వచించబడింది. స్వంత సేద్యంకోసం కౌలుదార్ల నుండి వశపరచుకోగల భూమియొక్క గరిష్ట పరిమితి కూడా ఎక్కువగా నిర్ణయించబడింది. బొంబాయిరాష్ట్రంలో 48 ఎక రాల సామాన్య మెట్ట, లేదా 24 ఎకరాల సామాన్య మాగాణి లేదా 12 ఎకరాల శ్రేష్టమైన మాగాణి వరకూ;

హైదరాబాద్‌లో 3 కుటుంబ కమతాలు, అంటే 21 ఎకరాల మాగాణి లేదా భూమి తరగతినిబట్టి 48 నుండి 216 ఎకరాల మెట్ట వరకూ; పంజాబ్, పెప్సూలలో 60 ఎకరాల వరకూ; మద్రాసులో 25 ఎకరాల మాగాణి లేదా 75 ఎకరాల మెట్ట వరకూ కౌలుదారులనుండి భూస్వాములు స్వంత సేద్యం పేరిట స్వాధీనం చేసుకోవచ్చు. భూస్వాములకు స్వంత సేద్యం పేరుతో కలుగజేసిన యీ సౌకర్యాలతో లక్షలాది ఎకరాల కౌలుభూములనుండి కౌలుదారులు బేదఖలుచేయబడ్డారు.

మూడవది: కౌలుభూములను కౌలుదారులు కొను క్కునే హక్కు చాలా కొద్దిమందికి మాత్రమే యివ్వబడింది. ఒక నిర్ణీత తేదీనుండి 6 - 12 సం॥ల కాలం వరకు వరుసగా భూమిని కౌలుకు చేస్తున్నట్లు నిరూపించుకున్న కౌలుదార్లకు మాత్రమే (వీరిని రక్షితకౌలుదారు లంటారు) కౌలు భూము లను కొనుక్కునే హక్కు గుర్తించబడింది. కౌలుకు సంబం ధించి వ్రాతపూర్వకమైన ఆధారాలు బహు స్వల్పంగావడం వలన యీ నిరూపణ ఆచరణలో కష్టసాధ్యమని తెలిసిందే. కావున యీ హక్కును ఉపయోగించుకున్నవారు చాలా కొద్ది మంది మాత్రమే. వీరిలోకూడా కొనుక్కోవలసిన భూమి ధరలు చాలా ఎక్కువగా ఉండుటచే (హైదరాబాద్‌లో మెట్ట అయితే భూమి శిస్తుకు 75 రెట్లు, మాగాణి అయితే 32 రెట్లు, పెప్సూలో 90 - 200 రెట్లు, బొంబాయిలో 6 - 12 రెట్లు, యిలాగే మిగిలినచోట్ల) చాలా కొద్దిమంది భూమి కొనుక్కో గలుగుతున్నారు. అదివరకే కొద్దో గొప్పో డబ్బున్నవారు మాత్రమే యీ హక్కును వినియోగించుకోగలిగారు. ఉదా

హారణకు బొంబాయిలో 8 సం॥ల లోను యీ హక్కును విని
యోగించుకున్నవారు 100 కి ఇద్దరు మాత్రమే.

నాలుగవది: చట్టాలు క్లిష్టంగా ఉండుట వలననూ,
తమ హక్కులను నిరూపించుకోవలసిన బాధ్యత కౌలుదారులకే
వదలివేయుట వలననూ, చట్టాల నమలుజరపవలసిన ప్రభుత్వ
యంత్రాంగం చాలావరకు భూస్వాముల అనుకూలురతో
నిండియుండుట వలననూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ బల
హీనంగా ఉన్న కౌలుదారులు భూస్వాముల నెదిరింపలేదు.

పైన చెప్పిన లోపాల నుపయోగించుకొని లక్షలాది
కౌలుదారులు కౌలుభూములనుండి బేదఖలు చేయబడ్డారు.
ఉదాహరణకు ప్లానింగ్ కమిషన్ సలహా సంఘమైన భూసం
స్కరణల ఉపసంఘంయొక్క టెనెన్సీ కమిటీ 1956 మధ్య
భాగంలో యిలా నివేదించింది: "బొంబాయి రాష్ట్రంలో
1948 - 57 మధ్యకాలంలో కవులుదారుల సంఖ్య 17 లక్షల
నుండి 13 లక్షల 60 వేలకు (20 శాతం) తగ్గినట్లు తెలుస్తోంది.
ఇదే కాలంలో కౌలుదారుల సాగులోనున్న భూమి కూడా
18 శాతం తగ్గినట్లు కన్పించింది. ఇటీవలనే హైదరాబాద్
ప్రభుత్వం జరిపిన విచారణ ఫలితంగా 1951 - 55 ల మధ్య
భాగంలో కౌలుదారులు చాలా పెద్దయెత్తున భూములు
పోగొట్టుకున్నారని తేలింది. రక్షిత కౌలుదారుల సంఖ్య 57
శాతం, వారి సాగులోనున్న భూమి 59 శాతం తగ్గింది......
కౌలుదారులు - భూస్వాముల మధ్య సంబంధాలను కట్టుదిట్ట
మొనర్చడం యీ విధంగా విఫలమయింది."

అయితే యీ చట్టాలవలన గలిగిన కొన్ని మార్పులను కూడా మనం గమనించాలి. అన్నిరకాల భూస్వాములు నేడు చాలావరకు స్వంతసేద్యానికి పూనుకుంటున్నారు. ఆధునిక వ్యవసాయ పద్ధతులు వ్యాప్తిచెందుతున్నాయి. రక్షిత కౌలు దారులలో పై తరగతికి చెందిన కొందరికి భూములు లభించాయి. బేదఖలు కాకుండా మిగిలిపోయిన కౌలుదారులకు కొన్ని తాత్కాలిక రక్షణలు కలిగాయి. సాధారణ కౌలు దారులకు కౌలురేట్లు యిదివరకు కంటె తగ్గించబడ్డాయి. కనీస కౌలుకాలం నిర్ణయించబడింది.

## కమతాలకు గరిష్ట పరిమితి

1949 లో నియమించబడిన కుమారప్ప కమిటీ 3 కుటుంబ కమతాల ప్రమాణంలో గరిష్ట పరిమితిని నిర్ణయించాలని సూచించింది. కుటుంబ కమతం అంటే ఏడాదికి మొత్తం రు. 1600/– ఫలసాయాన్నిగాని, వ్యవసాయ ఖర్చులు పోను రు. 1200/– నికరాదాయాన్నిగాని యిచ్చే క్షేత్రమని రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో సూచించబడింది. ఇదే సూచనను ప్రణాళికా భూసంస్కరణల ఉపసంఘం (దీనిలో అన్ని పార్టీల ప్రతినిధులు ఉన్నారు) కూడా చేసింది. ఐనప్పటికీ, దరిమిలా కేంద్ర ప్రణాళికా సంఘం యీ నిర్దిష్ట ప్రతిపాదనను మార్చివేసింది. ఆ నిర్ణయాన్ని రాష్ట్ర ప్రభుత్వాలకే వదలివేశారు. ఈవిధంగా భూస్వాముల ప్రయోజనాలతో ముడివేసుకుని ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలు హెచ్చు గరిష్ట పరిమితిని ఏర్పరచి భూపంపక కార్యక్రమాన్ని నామకః చేసేందుకు అవకాశమివ్వబడింది.

అలాగే గరిష్ట పరిమితిని నిర్ణయించడంలో ఒక కుటుంబాన్ని ప్రాతిపదికగా తీసుకోవాలనీ, 5 గురు సభ్యులుగల ఒక కుటుంబాన్ని ఒక యూనిట్‌గా పరిగణించాలనీ ముసాయిదా ప్రణాళికలో స్పష్టంగా చెప్పబడింది. కాని కేంద్ర ప్రణాళికా సంఘం దరిమిలా ఒక వ్యక్తికి ఉండే క్షేత్రాన్ని ప్రాతిపదికగా తీసుకోవాలా లేక కుటుంబాన్ని ప్రాతిపదికగా తీసుకోవాలా అన్న విషయాన్ని తేల్చి చెప్పకుండా రాష్ట్ర ప్రభుత్వాల నిర్ణయానికి వదలివేయడం జరిగింది. తద్వారా భూస్వాముల ప్రాబల్యం ఎక్కువగా ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలు వ్యక్తి ప్రాతిపదికనే తీసుకుని గరిష్ట పరిమితి ఎక్కువ నిర్ణయించే అవకాశం యివ్వబడింది. ఉదా: ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తీసుకువచ్చిన బిల్లులో యిదే ప్రాతిపదిక తీసుకోబడింది. దీనితో పంపకానికి భూములేమీ మిగలకుండా పోతాయి. భూమిపై భూస్వాములకున్న గుత్తాధికారం, గ్రామాలలోని ఆర్థిక వ్యత్యాసాలు అలాగే ఉంటాయి. అసలు ప్రణాళిక లక్ష్యాలే వమ్మయిపోతాయి.

అంతేగాదు. గరిష్ట పరిమితి నుండి పండ్ల తోటలూ, పంచదార ఫ్యాక్టరీలకు చెందిన చెరుకు భూములూ, ఎక్కువ పెట్టుబడితో గూడిన అధునాతన క్షేత్రాలూ వగైరాలు మినహాయించబడతాయి. దీనివలన పంపకంకోసం మిగిలే భూమి మరింత తగ్గిపోగలదు.

ఈవిధంగా ముసాయిదా సూచనలకు తూట్లుపొడిచిన పిమ్మట వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు తమ యిచ్ఛవచ్చినట్లు సీలింగులను నిర్ణయిస్తున్నాయి. భవిష్యత్ కమతాలపై

సీలింగును, ప్రస్తుత కమతాలపై సీలింగును నిర్ణయిస్తూ యీ క్రింది రాష్ట్రాలలో యీ క్రింది విధంగా చట్టాలు చేయబడ్డాయి.

| రాష్ట్రం పేరు. | ప్రస్తుత కమతాలపై సీలింగు. | భవిష్యత్ కమతాలపై సీలింగు. |
|---|---|---|
| హైదరాబాద్ ప్రాంతం. | $4\frac{1}{2}$ కుటుంబ కమతాలు. | 3 కుటుంబకమతాలు. |
| అస్సాం | 50 ఎకరాలు. | 50 ఎకరాలు. |
| హిమాచల్ ప్రదేశ్ | 30 ,, | ... |
| జమ్మూ-కాశ్మీర్ | $22\frac{3}{4}$ ,, | $22\frac{3}{4}$ ఎకరాలు. |
| పెప్సు | 30 స్టాండర్డ్ ఎకరాలు | 30 స్టాండర్డ్ ఎకరాలు. |
| పశ్చిమ బెంగాల్ | 25 ఎకరాలు. | 25 ఎకరాలు. |
| బొంబాయి | — | 3 కుటుంబ కమతాలు. |
| మధ్యప్రదేశ్ | — | 50 ఎకరాలు. |
| ఢిల్లీ | — | 30 స్టాండర్డు ఎకరాలు. |

ప్లానింగ్ కమిషన్ భూసంస్కరణల ఉపసంఘం యొక్క అంచనాలను దాదాపు ఎక్కడా పాటించలేదని పై టేబిల్ రుజువుచేస్తుంది. పైవిధంగా ప్యాసుచేయబడిన చట్టాలనుకూడా సక్రమంగా అమలు జరుపలేదు. చట్టాలు చేశాక సంవత్సరాలు గడిచినా అమలుజరుప ప్రయత్నించని రాష్ట్రాలుకూడా ఉన్నాయి.

వీటి సమయపరచుటలో విఫలత :- కమతాల గరిష్ట పరిమితి నిర్ణయించేందుకు సేకరించిన లెక్కలే అసలు తప్పుగా ఉన్నాయని చెబుతూ డాక్టర్ డేనియల్ థార్నర్ యిలాచెప్పారు : "ఇప్పుడు సేకరించే కమతాల లెక్కల ప్రయోజనం చాలాకొద్ది. తప్పుడు గ్రామ రికార్డులూ, 1954

నాటి లోప భూయిష్టమైన పెద్దవాళ్ల ప్రకారము సేకరించే యీ లెక్కలు గురికి బారెడు దూరంలో ఉండటమేగాక, తప్పుదారులు పట్టించడానికి కూడా దోహదిస్తాయి."

ఇక యీ చట్టాల అమలు యెలా జరుగుతూందో వివరిస్తూ అఖిలభారత కిసాన్‌సభ కార్యదర్శియైన శ్రీ సంసూరి ప్రసాదరావుగారు "ప్రభుత్వ వ్యవసాయ విధానం" అనే తమ పుస్తకంలో యిలా వ్రాశారు:

"పశ్చిమ బెంగాల్‌లో సీలింగుకు చట్టం ప్యాసయి ఏడాదికిపైగా అయినా దానినమలు పరచడమే లేదు. త్రిపుర, హిమాచల్ ప్రదేశ్‌ల విషయంకూడా అంతే. పెప్సూలో రాష్ట్రపతి పరిపాలనాకాలంలోనే ఒక చట్టం ప్యాసయింది. కాని రెండేళ్లపాటు దాని నమలుజరుపకుండా తొక్కిపట్టి ఉంచారు. ఇటీవలనే దానిని భూస్వాముల కనుకూలంగా సవరించారు. ఈ సవరణలు ప్లానింగ్ కమిషన్, కేంద్ర ప్రభుత్వముల సలహాపైననే చేయబడినవికూడా. పంజాబులో ... ... చట్టం అయితే ప్యాసయిందిగాని ఏడాదివరకూ రూల్సు జారీచేయబడలేదు. తీరా రూల్సు ప్యాసయిన తర్వాతచూస్తే భూస్వాములనుండి ఒక్క ఎకరంకూడా తీసుకుంటానికి వీలు పడదని తేలింది. అనేక సాకులతో కమతాలను సీలింగునుండి మినహాయించటానికి యీ రూల్సు చేయబడ్డాయి ... ... పశ్చిమ బెంగాల్‌లో సీలింగు 25 ఎకరాలుగా నిర్ణయించటమైతే జరిగింది. కాని యివి ఒక్కొక్కవ్యక్తికేగాని కుటుంబానికిగాదు......పైగా దీనికితోడు అన్ని పండ్లతోటలూ,

చేపల చెరువులూ మున్నగునవి ,సీలింగునుండి మినహాయింప బడడంవల్ల ప్రయోజనం లేకుండా పోయింది.”

ఇక హైదరాబాద్‌లో ఆక్టుప్యాసయిన రెండేళ్ల తర్వాత కూడ ఖమ్మం, ఔరంగాబాద్ జిల్లాలలో మాత్రమే అమలు జరుప పూనుకున్నారు. ఈ రెండేళ్లలోనూ భూస్వాములు, కుటుంబంలో విభాగాలు చేసుకోవడం, అన్యాక్రాంతాలు చేయడం వగైరా చర్యలద్వారా తమయిల్లు చక్కబెట్టుకో టానికి పూర్తి అవకాశం యివ్వబడింది. ఈ విభాగాలన్నీ సక్రమమైనవని ప్రభుత్వం అంగీకరించింది. ఫలితంగా భూమి పంపకం ప్రారంభమయ్యేసరికి మొదట అనుకున్న దానిలో 10 శాతంగూడా మిగలలేదు.

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ కమతాల సీలింగుబిల్లు యెలా తయారయిందో అందరికీ తెలుసు. వ్యక్తిప్రాతిపదికపైన ఒక్కొ క్కరికి పచ్చికబీడుతోగలిపి సాలీనా రూ. 14400/- ఫలసాయం వచ్చేభూమి చొప్పున 5 గురుగల కుటుంటానికి రు. 72000/- ఫలసాయం వచ్చేభూమిని వదలి,ఆపై అదనపుభూమిని స్వాధీనం చేసుకోవాలని సూచించబడింది. బహుశా అన్నిరాష్ట్రాలకన్న గరిష్టపరిమితిని గరిష్టస్థాయిలో నిర్ణయిస్తున్న గౌరవం మన ఆంధ్రమంత్రులకే దక్కిందనుకుంటాను !

## బంజరు భూములు

బంజరుభూముల పంపకాన్ని గూర్చి పంచవర్ష ప్రణాళి కలు దాదాపు మౌనముద్ర వహించాయి. రెండవ ప్రణాళి కలో బంజరుభూమి 95 లక్షల ఎకరాలుంటుందని అంచనా

వేయబడింది. కాని దీని పంపకానికి ఎట్టిపథకాన్ని సూచించ లేదు.

పైగా యీనాడు వ్యవసాయకూలీలూ, పేదరైతులూ, సాగుచేసుకుంటున్న బంజరుభూములనుకూడా ప్రభుత్వం ఊడ బెరుక్కుంటున్నది. ఆంధ్రరాష్ట్రంలో బంజర్లను పేదలకు పంచా లని శాసనసభలో ఏకగ్రీవంగా అంగీకరించబడినా, తరువాత ప్రభుత్వం దీనిని తిరస్కరించి సాగుదార్లను బేదఖలుచేయ బూనుకున్నది. అలా బీదలనుండి గుంజుకున్న భూమిని రాజకీయ బాధితులనే పేరుతో కాంగ్రెసువారికి కట్టబెడుతున్నది. లంక భూములలో మూడవవంతును బహిరంగవేలానికి పెట్టి ఎక్కువపాట పాడగల భూస్వాములకు కట్టబెడుతూంది. ఈ మధ్యనే ప్రభుత్వభూముల కేటాయింపుగూర్చి ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వుల ద్వారా బంజరు సాగుదార్లను పూర్తిగా వెళ్ల గొట్ట సమకట్టింది.

ఇతర రాష్ట్రాలలోకూడా ప్రభుత్వభూములను సాగు చేసే బీదలను పెద్దఎత్తున బేదఖలు చేస్తున్నారు. మహా రాష్ట్రలో అడవిభూములను సాగుచేసే ఆదిమజాతులను; అస్సాం, త్రిపుర రాష్ట్రాలలో 'ఘూం' భూములనుండి ఆది వాసులను బేదఖలుచేశారు. ఈ విధంగా ప్రభుత్వం చేసే బేద ఖల్లు భూస్వాములు చేసే బేదఖల్లకేమీ తీసిపోవడంలేదు.

## కమతాల ఏకీకరణ

భూమి చిన్నచిన్న ముక్కలైపోకుండ (fragmentation) నిరోధించవలసి యున్నదని, గిట్టుబాటుగాని కమతాలు (uneconomic holdings) లేకుండా చేయాలనే పేరుతో కమ

తాల ఏకీకరణకు పూనుకోవలసి యుంటుందని ప్రణాళికలో సూచించబడింది.

దీనిని దృష్టిలో పెట్టుకుని కొన్ని రాష్ట్రప్రభుత్వాలు గిట్టుబాటు కమతాన్ని (economic holding) నిర్ణయిస్తూ చట్టాలు చేశాయి. మధ్యప్రదేష్‌లో 15 ఎకరాలు, వింధ్యప్రదేశ్‌లో 5 ఎకరాలు, హైదరాబాద్‌లో 2 నుండి 24 ఎకరాలు, ఉత్తర ప్రదేశ్‌లో 6¼ ఎకరాలు, ఢిల్లీలో 8 స్టాండ్ర్డ్ ఎకరాలు కనీస కమతాలుగా నిర్ణయించబడ్డాయి.

ఒక గ్రామాన్ని ఒక యూనిట్‌గా తీసుకుని ఒకే వ్యక్తికి దూరదూరంగా ఉన్న చిన్నచిన్న గిట్టుబాటుగాని కమతాలను యితరులతో ఒప్పందం ద్వారా ఒకేచోటికిచేర్చి పెద్దకమతంగా రూపొందించాలని, ఆ విధంగా క్రమంగా గిట్టుబాటుకాని కమతాలు లేకుండాచేయాలని సంకల్పించబడింది. ముఖ్యంగా కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయవిస్తరణ కేంద్రాలలో యీ పద్ధతిని అమలుబరపాలని సూచించబడింది. మొట్టమొదట యీ పద్ధతి స్వచ్ఛందంగా రైతుల అంగీకారంతో జరగాలని చెప్పినా, దరిమిలా కొంత నిర్బంధం ఉపయోగించైనా సరే అమలుజరప బూనుకున్నది ప్రభుత్వం. ఈ వైఖరితో బరోడా, మధ్యప్రదేశ్, పంజాబ్, ఉత్తర ప్రదేశ్, జమ్మూ-కాశ్మీర్, పెప్సూ, ఒరిస్సా, రాజస్థాన్, పశ్చిమబెంగాల్, హిమాచల్ ప్రదేశ్, బీహార్, హైదరాబాద్ ప్రాంతాలలో కమతాల ఏకీకరణగూర్చి కొంత కృషి జరిగింది. ఇంతవరకు కేంద్రప్రభుత్వ లెక్కలప్రకారం

(ఇండియా - 1958 లో ప్రచురించబడ్డాయి) యీ క్రింది విధంగా కమతాల ఏకీకరణ జరిగింది :

| రాష్ట్రం. | | '56 ఆఖరుకు జరిగిన కమతాల ఏకీకరణ (లక్షల ఎకరాలలో) | ఎన్ని గ్రామాలలో? |
|---|---|---|---|
| బొంబాయి | ... ... | 21.2 | 1860 |
| ఢిల్లీ | ... ... | 2.0 | 210 |
| పంజాబ్ - పెప్సు | ... | 61.4 | — |
| ఉత్తర ప్రదేష్ | ... | 43.9 | — |

ఈ కృషిలో క్రమంగా గిట్టుబాటుగాని కమతాలను యజమానుల కిష్టమున్నా లేకపోయినా బలవంతంగా వారి చేత అమ్మించాలనే ప్రయత్నం జరుగవచ్చు. ఇది చాలా అనర్థకాలకు దారితీసే ప్రమాదమున్నది.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయాన్నభివృద్ధి చేయాలనే లక్ష్యం రెండు ప్రణాళికలలోనూ చెప్పబడింది. రెండవ ప్రణాళికలో సహకార వ్యవసాయ నిర్మాణానికి యీ క్రింది సూచనలు చేయబడ్డాయి. "ద్వితీయ ప్రణాళికలో సహకార వ్యవసాయాభివృద్ధికొరకు రూపొందించబడిన కార్యక్రమంక్రింద, రానున్న 10 - 15 సంllలలో దేశంలోని వ్యవసాయభూమిలో అధికభాగం సహకారపద్ధతుల ప్రకారం సాగుచేయబడునట్లు తగినకృషి జరుపబడవలసియున్నది ...... ఈ సందర్భంలో ద్వితీయ ప్రణాళికలో చేయబడిన సూచనలందు ముఖ్యమైనవి దిగువ వివరించబడ్డాయి :-

(1) "ప్రారంభంలో ప్రతిజిల్లాలోనూ, కొంత కాల మైన తరువాత ప్రతి సమాజవికాస, జాతీయవికాస కార్య క్రమప్రాంతంలోనూ, సహకార వ్యవసాయంలో ప్రయో గాత్మక ప్రాజెక్టులు ప్రారంభించబడి, వ్యవసాయక్షేత్రాల నిర్వహణకు తగిన మేలయిన పద్ధతులను కనుగొనడానికి కృషిచేయగాలి. ఈ కేంద్రాలు దరిమిలా సహకారసేవకులకు, వ్యవసాయసేవకులకు ప్రాక్టికల్ తరిఫీదు కేంద్రములుగా అభివృద్ధి చేయబడవచ్చును. (2) కమతాలకు గరిష్టపరిమితిని విధించడంవల్ల లభించే అదనపుభూములు సహకారపద్ధతుల ప్రకారం సాగుచేయబడాలి. (3) ప్రాథమిక కమతంకన్న చిన్నవైన భూముల యజమానులు అంగీకరించిన పక్షంలో వాటినన్నింటినీ సహకార వ్యవసాయక్షేత్రాల క్రిందకు తీసు కునిరావాలి. (4) ప్రస్తుతం పనిచేస్తున్న సహకార వ్యవ సాయ సంఘాలలో అధికభాగం సరిగ్గా పనిచేయడంలేదు. ఇట్టివానిని సరియైనపద్ధతులలో పెట్టి, పటిష్టమొనర్చుటకు తగిన చర్యలను తీసుకోవలసియున్నది. (5) సామాన్య కమ తాలుగల రైతులందరూ చిన్నచిన్న సమూహాలుగా సహకార వ్యవసాయ సంఘములను యేర్పరచుకొను నట్లు తగిన ప్రోత్సాహ మివ్వబడాలి. (6) ఆదిమజాతి ప్రాంతాలలో వ్యవసాయపద్ధతులను సంస్కరించిన తరువాత సహకార వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్టడానికి తగిన చర్యలు తీసు కొనబడాలి." (రెండవ ప్రణాళిక సంగ్రహపాఠం - పేజీలు 74 – 75).

సహకార వ్యవసాయం సాగిస్తున్న వారికి విరివిగా పరపతి సౌకర్యాలు కలుగచేయుటలో ప్రాధాన్యత యివ్వబడుతుందని, మేలుజాతి విత్తనాలు, యెరువులు, వ్యవసాయ పరికరాలు సరఫరా చేయడం ద్వారా యితర సౌకర్యాలు యివ్వబడగలవని చెప్పబడుతోంది.

కాని యింతవరకు ఎక్కువగాను పెద్దయెత్తున సహకార వ్యవసాయ క్షేత్రాలు అభివృద్ధి కాలేదు. ప్రభుత్వ లెక్కల ప్రకారం 1957 మే ఆఖరుకు దేశం మొత్తంమీద 1397 క్షేత్రాలు మాత్రమే నెలకొల్పబడ్డాయి. కాని ఏ ఒక్క క్షేత్రమూకూడా ఆదర్శప్రాయంగా పనిచేయుట లేదని, చాలా లోపభూయిష్టంగా నడుస్తున్నాయని ప్లానింగ్ కమీషన్ యొక్క కార్యక్రమ అంచనాల కమిటీ తనరిపోర్టులో తెలియజేసింది. ఆ కమిటీ రిపోర్టులోని కొన్ని మచ్చుతునకలు యీ క్రింద యివ్వబడ్డాయి:

మధ్యప్రదేశ్ లోని "కొత్త అకోలా" క్షేత్రం: "సంఘంలోని అత్యధిక సంఖ్యాకసభ్యులు పొలంలో ఏ మాత్రం పనిచేయడం లేదు. కాబట్టి వ్యవసాయం ప్రధానంగా కూలీల ద్వారానే చేయబడుతుంది."

పంజాబులోని "షాహాబ్ పురా" క్షేత్రం: "ఈ సంఘం ఆదర్శ సహకారవ్యవసాయ సంఘంమాత్రం కాదు. ఇది మేనేజింగ్ ఏజెంట్లు, పెద్దజీతగాండ్ర, వ్యవసాయకూలీల ద్వారా పనినంతా సాగించే వ్యాపారసంస్థగా ఉన్న లిమిటెడ్ కంపెనీ. బీరకాయపీచు సంబంధంగల చుట్టాలందరూ కలిసి ఏర్పర్చిన సంఘంయిది. ఇందులో ఎక్కువమంది పని

చేయకుండా, హాజరుకాకుండా కేవలం లాభాలు పంచుకోటానికి చేరినబాపతు. కవ్రులుచట్టాలనూ, భూసంస్కరణలను తప్పించుకోవడమే యీ సంఘాన్ని ఏర్పరచడంలో ప్రధాన లక్ష్యం."

పశ్చిమ బెంగాలులోని "సోద్యా" క్షేత్రం : అధ్యక్ష స్థానానికి జరిగిన యిటీవల ఎన్నికలు చాలా తగాదాలను రెచ్చగొట్టాయి. రెండు కక్షలు సంఘంలో ఏర్పడ్డాయి. ఇందులో ఏ ముఠాకూ మెజారిటీ లేనందున అస్థిరపరిస్థితి ఏర్పడింది."

యు. పి. లోని "జనౌర" క్షేత్రం : "ప్రస్తుతం ఉన్న చట్టాలప్రకారం, భూమిదార్లూ, శేరీదార్లూ, తమభూములను కౌలుకు యివ్వరాదు. సహకారసంఘాలలో చేర్చడం మూలకంగా, మొత్తం 20 మందిలోనూ 13 మంది సభ్యులు ఏమీ కాయకష్టం చేయకుండానే, కష్టంలేకుండానే, మంచిఫలితాలను పొందుతున్నారు. సభ్యులు కొంతపనైనా పొలంలో చేయాలన్నరూలు సొసైటీ బైలాలలో లేకపోవడంవల్ల యిలా జరుగుతున్నది."

పై ఉదాహరణలు తెలిపేదేమిటి ? సామాజిక వ్యవస్థలో తీవ్రమైన మార్పులు జరగకుండా సహకార వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్ట పూనుకుంటే జరిగేది భూసంస్కరణల చట్టాలనుండి తప్పించుకోటానికి భూస్వాములు బూటకపు వ్యవసాయ సహకార సంఘాలను ఏర్పాటు చేయడమేగాని, సామాన్యప్రజలతో గూడిన సహకార వ్యవసాయం అభివృద్ధిగాదు.

చైనాలో సహకార వ్యవసాయం జయప్రదంగా సాగుటకు, మన దేశంలో పూర్తిగా విఫలమగుటకు కారణమేమిటి? చైనాలో భూస్వామ్య విధానమన్నదే లేకుండా పూర్తిగా రద్దు చేయబడింది. వ్యవసాయకూలీలకూ, పేదరైతులకూ భూమి పంచిపెట్టబడింది. పాత అప్పులన్నీ రద్దు చేయబడ్డాయి. మార్కెట్ అదుపులో పెట్టబడింది. భూస్వాముల పరికరాలను, పశువులనుకూడా స్వాధీనం చేసుకుని దున్నేవారికి పంచిపెట్టబడ్డాయి. కష్టపడి పండించే రైతాంగానికి అనేక యితర సౌకర్యాలు కలిగించబడ్డాయి. దానితో గ్రామసీమలలో వ్యవసాయంలో ఒక నూతనవ్యవస్థ, దోపిడిదారులకు తావులేని వ్యవస్థ, వ్యవసాయాభివృద్ధికి దోహదమిచ్చే కొత్త వాతావరణం సృష్టించబడ్డాయి. ఆచరణలో రైతాంగం సహకార వ్యవసాయం యొక్క ఆధిక్యతను స్వానుభవం ద్వారా తెలుసుకునేందుకు అవకాశం యివ్వబడింది. ఫలితంగా కొద్దికాలంలోనే దాదాపు రైతాంగమంతా సహకార వ్యవసాయ కార్యక్రమాన్ని స్వీకరించారు.

కాని మన దేశంలో యివేవీజరుగలేదు. భారత ప్రభుత్వం భూస్వాముల, వడ్డీవ్యాపారుల ప్రభావానికి లోబడి వుండే సామాజికవ్యవస్థను సమూలంగా నిర్మూలించకుండా ఆ పరిధిలో సహకార వ్యవసాయాన్ని ప్రవేశపెట్ట జూస్తున్నది. ఇటువంటి ప్రయత్నం సహజంగా విఫలంగాక తప్పదు.

## యంత్రాలతో వ్యవసాయం

యంత్రాలతో వ్యవసాయం సాగించాలనే కృషిని భారతప్రభుత్వం ప్రోత్సహిస్తోంది. ప్రస్తుత పరిస్థితులలో

అలాంటి వ్యవసాయం లాభంకన్న నష్టానికే దారితీస్తుంది. భారతదేశం పారిశ్రామికంగా వెనుకబడియున్న దేశం గావడం వలన 100కి 70 మంది వ్యవసాయంపై ఆధారపడుతున్నారని యిదివరకే తెలుసుకున్నాము. వీరిలో అత్యధికభాగం ఉద్యోగవసతులు లేక బాధపడుతున్నారు. పారిశ్రామికోద్యోగాల అవకాశము తక్కువగాఉన్నది. అలాంటప్పుడు పెద్ద పెద్ద భూఖండాలలో యంత్రాలసహాయంతో వ్యవసాయం ప్రారంభిస్తే మరికొన్ని లక్షలమంది నిరుద్యోగులు గాక తప్పదు.

అందువలన యంత్రాలను ప్రవేశపెట్టేకన్న రైతులుపయోగిస్తున్న పురాతన పరికరాలను మరింత అభివృద్ధిచేసి శాస్త్రీయ పద్ధతులలో వ్యవసాయోత్పత్తికి ఎక్కువ ఉపయోగకరంగా ఉండేటట్లు చూడాలి. సహకార వ్యవసాయ క్షేత్రాలు అభివృద్ధియైన పిమ్మటనే యంత్రాలతో పెద్ద యెత్తున వ్యవసాయాన్ని సాగించడానికి అవకాశం ఏర్పడుతుంది

కాని యీ విషయాన్ని ప్రభుత్వము విస్మరించింది. 1947 లో 200 అమెరికన్ ట్రాక్టర్లతో కేంద్రట్రాక్టర్ సంస్థ నెలకొల్పబడింది. 1951 లో వీటికి మరొక 240 ట్రాక్టర్లు చేర్చబడ్డాయి. 1953 – '54 లో వివిధ రాష్ట్రప్రభుత్వాలు 279 ట్రాక్టర్లను కొన్నాయి. వీటిని రైతులకు అద్దెకిస్తున్నాయి. ప్రైవేట్ భూస్వాములుకూడా అక్కడక్కడ ట్రాక్టర్ వ్యవసాయాన్ని ప్రారంభించారు. 1949 – '50 లో 3318 ట్రాక్టర్లూ, 1951–'52 లో 7400, 1952–'53 లో 1227,

1953–'54 లో 3195 ట్రాక్టర్లూ మన దేశం దిగుమతి చేసుకున్నది.

ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల స్వభావం :- ఇంతవరకు ప్రభుత్వం ప్రవేశపెట్టిన, ప్రవేశపెట్టదలచుకున్న వ్యవసాయ సంస్కరణలయొక్క వివరాలను తెలుసుకున్నాము. అయితే మొత్తంమీద యీ సంస్కరణలయొక్క స్వరూప మేమిటి, వాటియొక్క లక్ష్య మేమిటి అనేదానిని పరిశీలించ వలసియున్నది.

పాత జమీందారీ ప్రాంతాలలోను, రైత్వారీ ప్రాంతాలలోనూ కూడా పెట్టుబడిదారీ వ్యవసాయ పద్ధతుల నభివృద్ధిచేయడమే కాంగ్రెసు ప్రభుత్వం ప్రవేశపెడుతున్న భూసంస్కరణల ప్రధానాశయంగా కనబడుతుంది. ఫ్యూడల్ భూస్వాములకు నష్టపరిహారం యిచ్చుటద్వారాను, స్వంత కమతం పేరుతో లక్షలాది ఎకరాల సుక్షేత్రాలను వారికి కట్టబెట్టుటద్వారాను వారిని పెట్టుబడిదారీ భూఖామందులుగా మార్చేందుకు ప్రయత్నించబడింది. అలాగే రైత్వారీ ప్రాంతాలలోని భూస్వాములకు స్వంతసేద్యం పేరుతో ఎక్కువభూము లట్టిపెట్టుకొనుటకు అనుమతించుట, కమతాల గరిష్టపరిమితిని చాలా ఎక్కువగా నిర్ణయించుట, స్వాధీనం చేసుకున్న భూమికి కూడా హెచ్చుధరలు నిర్ణయించి పేదలు కొనుక్కునేందుకు వీలులేకుండా చేయుట వగైరా చర్యల ద్వారా పెట్టుబడిదారీ భూస్వామ్యవర్గాన్ని, ధనిక రైతువర్గాన్ని ఎక్కువచేసుకుని, ఆ వర్గపునాదిని బలపరచుకునే ప్రయత్నం

కనబడుతూంది. ఈ ధనిక భూఖామందులద్వారా పెట్టుబడిదారీ పారిశ్రామికాభివృద్ధి కవసరమైన వ్యావసాయికోత్పత్తిని సాధించదలచుకున్నారు. రెండోవైపున యీ వర్గం ద్వారా గ్రామసీమలలో తమ రాజకీయ పలుకుబడిని నిలదొక్కుకోదలచుకున్నారు.

కౌలుదారుల బేదఖళ్లను నిరోధించకపోవడం, బంజర్లను బీదలకు పంచకపోవడం, బంజరు సాగుదార్లను వెళ్లగొట్టడం, కమతాల ఏకీకరణ ప్రయత్నం, యంత్రాలతో వ్యవసాయాన్ని ప్రోత్సహించే వైఖరి యివన్నీ పై ప్రయత్నాన్నే రుజువు చేస్తాయి.



# వ్యవసాయ పెట్టుబడి - అప్పులు - పరపతి సౌకర్యాలు

మన గ్రామీణవ్యవస్థలో భూసంస్కరణల తర్వాత అత్యంత తీవ్రమైన సమస్య గ్రామీణఋణభారపు సమస్యయే. మన వ్యవసాయముయొక్క పరిస్థితినిబట్టి అత్యధికభాగం రైతాంగం వ్యవసాయపెట్టుబడికి గాని, యితర ఖర్చులకుగాని డబ్బుమిగుల్చుకోలేని స్థితిలో ఉన్నారు. పంటలు సరిగా పండని సంవత్సరాలలోను, ధరల ఒడుదుడుకుల మూలంగాను, చాలీచాలని ఆదాయంతో జీవితం గడుపుకొనుటకు, పెండ్లిండ్లు, పండుగలు, పబ్బాలు వగైరాలకు కావలసిన డబ్బుకు ఋణాలమీద ఆధారపడుతున్నారు. తెచ్చిన అప్పులు తీర్చే ఆధారం లేకపోవుటవలన అప్పులభారం క్రమంగా పెరుగుతూఉంది.

పెరిగిపోతున్న గ్రామీణ ఋణభారం :- ఋణభారం క్రమంగా ఎలాపెరిగిపోతూందో యీ క్రింది అంచనాలు తెలియజేస్తాయి.

| అంచనావేసిన వ్యక్తి. | సంవత్సరం. | ఋణభారం. (కోట్ల రూపాయలలో) |
|---|---|---|
| ఎడ్వర్డు మాక్‌లాగన్ | 1911 | 300 (అవిభక్త భారతదేశం) |
| ఎం. ఎల్. డార్లింగ్ | 1924 | 600 ( ,, ) |
| ఇండియన్ సెంట్రల్ బాంకింగ్ ఎంక్వయిరీ కమిటీ | 1930 | 900 ( ,, ) |
| డాక్టర్ ముఖర్జీ | 1935 | 1200 ( ,, ) |
| రిజర్వుబాంకు యొక్క వ్యవసాయ పరపతిశాఖ | 1937 | 1800 ( ,, ) |

ఈ లెక్కలలో కొన్ని లోపాలున్నమాట నిజమే. ఐనప్పటికీ వాడియా, మర్చెంటులవంటి ప్రముఖ అర్థశాస్త్ర వేత్తలు చెప్పినట్లు ఋణభారం క్రమంగా, అధికతరమౌతున్నట్లు యివి స్పష్టంచేస్తాయి. 1929-35 ల మధ్య ఆర్థికమాంద్యం వచ్చిన సంవత్సరాలలో వ్యవసాయ వస్తువులధరలు విపరీతంగా పడిపోవడంతో యీ ఋణభారం తీవ్రంగా పెరిగిపోయిందనుటలో సందేహంలేదు. ఆ కాలంలో కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఋణభారం తగ్గించేందుకు చేసినచట్టాలు అసమగ్రంగా ఉన్నందువలన సమస్య అలాగే ఉండిపోయింది.

అయితే తరువాత యుద్ధకాలంలో, 1939 - 45 ల మధ్య, నోట్ల ముమ్మరంవలన వ్యవసాయ సరుకుల ధరలు పెరుగుటద్వారా ఋణభారం చాలవరకు తగ్గిపోయిందని చెప్పబడుతూ ఉంది. ఈ వాదన సరియైనది కాదని మద్రాసు ప్రభుత్వ ఆర్థికవేత్తయైన డాక్టర్ బి. వి. నారాయణస్వామి నాయుడుగారి పరిశీలన (మద్రాసు రాష్ట్రంలో ప్రభుత్వం తరఫున ఈయన పరిశీలన సాగించారు) వలన ఋజువవుతుంది. గ్రామీణ జనాభాను ఈయన 5 తరగతులుగా విభజించి ఒక్కొక్క తరగతియొక్క ఋణభారం 1939 లో యెంత, 1945 లో ఎంత అనేది తేల్చారు. మొత్తం అప్పు 1939 లో రు. 271 కోట్ల 91 లక్షల 64 వేలుగాను, 1945 లో రు. 217 కోట్ల 71 లక్షల 15 వేలుగాను తేల్చారు. ఆ యా తరగతుల సగటు అప్పు యీ క్రిందివిధంగా ఉన్నది.

## ప్రతి తరగతికి సగటు అప్పు.

| తరగతి | 1939 రు. | 1945 రు. | వ్యత్యాసం | శాతం పెరుగుదల లేక తరుగుదల |
|---|---|---|---|---|
| 1. 25ఎ. అంతకు మించీ మాగాణి లేక మెట్టగల భూస్వాములు. | 88.5 | 13.3 | — 75.2 | — 39.9 |
| 2. 5–25ఎ. మధ్య గల మధ్యరకం వారు. | 78.8 | 59.4 | - 19.4 | - 24.6 |
| 3. 5ఎ. లోపుగల చిన్న రైతులు. | 42.8 | 37.6 | - 5.2 | - 12.3 |
| 4. కౌలుదారులు. | 20.5 | 21.3 | + 0.8 | + 4.1 |
| 5. భూమిలేని కూలీలు. | 5.7 | 8.3 | + 2.6 | + 45.6 |

## 1939 లోను, 1945 లోను ఐదుతరగతుల శాతం.

| తరగతి. | 1 | 2 | 3 | 4 | 5 | మొత్తం. |
|---|---|---|---|---|---|---|
| 1939 | 14.4 | 43.5 | 35.3 | 5.4 | 1.4 | 100 |
| 1945 | 10.9 | 41 0 | 38.7 | 7.0 | 2.5 | 100 |

డా॥ నాయుడుగారు సేకరించిన లెక్కలనుబట్టి యుద్ధ కాలంలో వ్యవసాయ సరుకుల ధరల పెరుగుదల కేవలం భూస్వాములకు బాగా లాభాలు చేకూర్చిపెట్టాయని, ధనిక మధ్యతరగతి రైతులు కొద్దిగా లాభం పొందారని; పేద రైతుల, కౌలుదారుల, వ్యవసాయకూలీల అప్పులు పెరిగా చే గాని తరగలేదని రుజువవుతుంది. ఇందు ఆశ్చర్యమేమీ లేదు.

పెట్టుబడిదారీ వ్యవసాయం ద్వారా కౌలురూపంలోగాని, లాభంరూపేణాగాని పెద్దమొత్తంలో వ్యవసాయోత్పత్తిని ప్రోగుచేయగలిగిన కొద్దిమంది భూకామందులు మాత్రమే యుద్ధకాలపు నోట్లముమ్మరంవల్ల లాభవడతారు. మిగిలిన బీదలకు అమ్ముకుని లాభపడేందుకు, అప్పు తీర్చుకునేందుకు వ్యవసాయ సరుకు ఎక్కడ మిగులుతుంది ?

1952 తరువాత తిరిగి వ్యవసాయ సరుకుల ధరలు తిరుగుముఖం పట్టడంవలన రుణభారం మరింత ఎక్కువయింది.

అప్పులుయిచ్చే ఏజెన్సీలు :- సాధారణంగా రైతులకు కావలసిన అప్పులు మూడురకాలుగా ఉంటాయి. (1) దీర్ఘకాలిక రుణాలు : (10-20 సం॥ల వరకు) పొలం వగైరా కొనుక్కునేందుకు, పాత అప్పులు తీర్చేందుకు యివి అవసరం. (2) తక్కువకాలపు రుణాలు : (2-5 సం॥ల వరకు) బావులు, వ్యవసాయ పరికరాల నిమిత్తం అవసరం. (3) తాత్కాలిక రుణాలు : విత్తనాలు, ఎరువులు, కూలి వగైరాల నిమిత్తం అవసరం.

మనదేశంలో గ్రామీణ ప్రజలకు అప్పులు యిచ్చే ఏజెన్సీలు ప్రధానంగా మూడు ఉన్నాయి : (1) వడ్డీవ్యాపారస్థులు (2) పరపతి సొసైటీలు (3) ప్రభుత్వ తక్కావీ రుణాలు.

వడ్డీవ్యాపారి :- గ్రామీణ ప్రజలకు అప్పులు యిచ్చే ప్రధాన ఏజెన్సీ గ్రామాలలోని వడ్డీవ్యాపారస్థులే. వీరిలో భూస్వాములుకూడా ఉన్నారు. 1951 రిజర్వుబాంకు సర్వే

ప్రకారం రైతులుచేసే ఋణాల మొత్తంలో 70% వడ్డీవ్యాపారస్థులనుండేనని తేలింది. ఈ వడ్డీవ్యాపారి ఎక్కడనుండి వచ్చాడు? ఇతడెవరో ప్రత్యేకవ్యక్తి అనుకోవడం పొరపాటు. కొన్ని వర్గాలవారు గ్రామీణ జనాభాలో అత్యధిక భాగాన్ని తమ యినుప పిడికిలిలో బిగించిపట్టి, అన్నివైపులనుండి దాడి చేసే యంత్రాంగంలో అంతర్భాగమే యితడు. ఉదాహరణకు రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియాచే నియమింపబడిన అఖిలభారత గ్రామీణ పరపతి పరిశీలనాసంఘం ప్రకటించిన రిపోర్టు యీ యంత్రాంగాన్ని యిలా వర్ణించింది:

"ఎక్కువగా పట్టణాలలో కేంద్రీకరింపబడిన ప్రయివేట్ ఆర్థికశక్తి ఒకటి నేటి భారతదేశంలో ఉన్నది. ఇంతకంటె ముఖ్యమైనదేమంటె, యీ అధికారాన్ని పంచుకునే వ్యక్తులు, సంస్థలు, వాటి కార్యకలాపాలు, వైఖరులు, కోర్కెలు, ప్రయోజనాలు - అన్నీ పట్టణ మనస్తత్వంతో నిండియున్నాయి. చాలవరకు దీనిని వలస ఆర్థికవిధానపు వారసత్వంగా పరిగణించవచ్చు. ఈ వలస ఆర్థికవిధానం పెద్ద పెద్ద ఓడరేవులలోను, పట్టణాలలోను స్థావరం ఏర్పరచుకుని గ్రామీణప్రాంతపు "వ్యాపార పంటలు" మొ॥ ముడిసరుకులను తనవైపుకు గుంజుకున్నది. గ్రామీణ ప్రాంతంలో నగదు ఆర్థికవిధానాన్ని ప్రవేశపెట్టింది. పెద్ద పట్టణం నుండి చిన్న పట్టణానికీ, అక్కడనుండి పల్లెటూరికీ చొచ్చుకుపోయింది. గ్రామీణ ప్రాంతంమీదబడి, అతి పురాతనమైన కుల, వర్గ, ఆధిపత్యాల నుపయోగించుకుని బహుముఖ ప్రాబల్యాన్ని పొందింది." (సాధరణ రిపోర్టు - పే. 274-75.)

ఇంకా "ఈ క్రొత్తతరహా ఎలాంటిదంటే, గ్రామీణ జనాభాలో అత్యధికభాగంగా నున్న బలహీన తరగతులను అధికార స్థావరాల్లో ప్రవేశించే మార్గంనుంచీ, ఆర్థికసహాయం లభించే స్థానాలనుంచీ చాలావరకు తెగగొట్టివేసింది ...... ఈ సంస్థల డైరెక్టర్లు, అధికారులు గ్రామీణ ప్రయోజనాల కంటె పట్టణ ప్రయోజనాలకే హెచ్చుగా శ్రద్ధచూపుతూ ఉంటారు. ఈ పట్టణ మనస్తత్వం ఒక్క ప్రయివేట్ ఆర్థిక సంస్థలకే పరిమితమై లేదు. అది సర్వసాధారణంగా యింకా ఎక్కువ ప్రాముఖ్యంగల స్టేట్ సంస్థలకు, వివిధరాష్ట్ర ప్రభుత్వాల ప్రధాన కార్యాలయాలకూ ఉపకార్యాలయాలకూ కూడ వ్యాపిస్తూంది. ప్రభుత్వానికీ, ప్రయివేట్ రంగాలకు సంబంధించిన యీ అధికార స్థావరాలు, ఆర్థికసహాయం లభించే స్థానాలతో సంబంధ, ప్రాబల్యాలు ఒక గొలుసు లాగ ఏర్పడియున్నది. అవసరమైనచోట్ల పరస్పర ఆర్థిక అంతస్సంబంధంకూడా ఏర్పడియున్నది. ఈ గొలుసు కొసను, అంటే గ్రామంలో, గ్రామ నాయకులైన పంచాయతీదారు, పటేలు మొ॥ వారు స్థానిక అధికారస్థావరాలను ఆక్రమించి యుంటారు. వడ్డీవ్యాపారులు, యితర వ్యాపారులు స్థానికంగా ఆర్థికసహాయం లభించే స్థానాలలో ఉంటారు. ఈ అధికారమూ, ఆర్థికమూ లభించే మార్గంలో వీరు ఒక భాగం కావడంవలన యీ మార్గంలో యింకాపైనున్న స్థావరాలలోనుంచి, మూలాధారాలలో నుంచి అధికారాన్ని, ఆర్థికాన్ని సంపాదించేవారుగా కూడ ఉంటారు. ఒక్కొక్క సారి ఒకేవ్యక్తి గ్రామనాయకుడుగాను, వడ్డీవ్యాపారి

గాను, మామూలు వ్యాపారిగాను కూడా వుంటాడు, లేదా వీరు విడివిడి వ్యక్తులైతే వీరిమధ్య ఒక విశాలమైన సఖ్యత పొసగిఉంటుంది. ఇక్కడ ముఖ్యమైనది ప్రత్యేకంగా నాయకత్వమే. ఈ నాయకత్వం, ఆస్తిపాస్తుల యాజమాన్యం వల్లగాని, చనువు సంధ్యాలు వచ్చియుండడం వలనగాని, ప్రబలమైన స్థానిక కులంలో ఆనువంశిక హక్కువల్లగాని, రాజకీయ పలుకుబడివల్లగాని సంక్రమించవచ్చు. యోగ్యత వల్లనో, సంస్కారంవల్లనో, గ్రామానికి సేవచేయగల సామర్థ్యంవల్లనో సంక్రమించడం చాలా అరుదు. (పేజి-276).

కావున యీ వడ్డీవ్యాపారంయొక్క సమస్య మొత్తం గ్రామీణ సమాజంయొక్క సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థతో ముడిపడియున్నదని గుర్తించగలము. ఈ వ్యవస్థను మార్చనిదే అధిక వడ్డీలపీడ వదలించడం సాధ్యంగాదు.

పరపతి సంఘాలు :- మన దేశంలో పరపతిసౌకర్యాలు చాలాతక్కువే అభివృద్ధి అయ్యాయి. సంవత్సరానికి వ్యవసాయదారులకు కావలసిన ఋణాలు మొత్తం రూ. 500-800 కోట్లవరకు ఉంటుందని అంచనావేయబడింది. కాని మన వ్యవసాయ క్రెడిట్ సొసైటీలు యిచ్చే ఋణాలు బహుస్వల్పంగా ఉన్నాయి. అవి యిచ్చిన అప్పులు యీ క్రిందివిధంగా ఉన్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| 1951 - '52 లో | ... | 24.21 | కోట్లరూపాయలు. | |
| 1952 - '53 లో | ... | 25.69 | ,, | ,, |
| 1953 - '54 లో | ... | 29.64 | ,, | ,, |

1954 – '55 లో ... 35.48 కోట్లరూపాయలు.
1955 – '56 లో ... 49.62 ,, ,,

(ఇండియా – 1958 నుండి)

ఇలా యివ్వబడిన ఋణాలలోకూడా ఎక్కువభాగం పలుకుబడిగల భూస్వాములు, ధనికరైతులు వుపయోగించు కుంటున్నారు. వడ్డీరేట్లు 7 – 12% వరకూ ఉండుటవలన, పలుకుబడి లేనందున పేదలు ఎక్కువ ఋణాలు తీసుకోలేక పోతున్నారు.

భూమితనఖా బాంకులు కూడా మన దేశంలో చాలా తక్కువే అభివృద్ధి అయ్యాయి. 1953 – '54 సం॥లో వీటి నుండి వ్యవసాయదారులకు రూ. 3.30 కోట్లు మాత్రమే ఋణాలు లభించాయి.

ప్రభుత్వ తక్కావీరుణాలు :– వీటిద్వారా కూడా వ్యవసాయదారులకు కావలసిన తాత్కాలిక ఋణాలలో 30% కన్న ఎక్కువ లభించడంలేదు. 1940 – '50 ల మధ్యగల పదేండ్లలో వీటిద్వారా రూ. 15 కోట్లు మాత్రమే అప్పులు యివ్వబడ్డాయి. కాని అధికారుల నిర్లక్ష్యప్రవృత్తి, కాలయాపన, లంచగొండితనము, తిరిగి వసూలుచేసేటప్పుడు పెట్టే యిబ్బందుల కారణంగా పేదవర్గాలవారు వీటిని ఎక్కువగా వినియోగించుకోలేక పోతున్నారు.

పైన వివరించిన వివిధరకాల పరపతి సౌకర్యాలను గురించి రూరల్ క్రెడిట్ సర్వే రిపోర్టు యిలాచెప్పింది :

"ఈ నాడు వ్యవసాయ పరపతి సౌకర్యాలు సరైన మొత్తాలలో అందడంలేదు. సరైన మోస్తరులోనూ లేదు. సరైన ఉపయోగమూ లేదు. అవసరాల దృష్ట్యా చూస్తే సరైనవారి కందడమూ లేదు. మొత్తం అవసరాలలో సుమారు 100 కి 3 వంతులు సహకార సంఘాలద్వారానూ, దాదాపు అదేప్రమాణంలో ప్రభుత్వంద్వారానూ పరపతి సౌకర్యాలందుతున్నాయి ...... సహకార సంఘాలిచ్చే అప్పులూ, ప్రభుత్వం యిచ్చే అప్పులూ కూడా చిన్న, మధ్యతరగతి వ్యవసాయదారులకన్న పెద్ద భూస్వాముల చేతులలోకే పోతున్నవని పరిశీలనవలన తేలుతుంది."

పరపతి సౌకర్యాల అభివృద్ధికి రూరల్ క్రెడిట్ సర్వే రిపోర్టు కొన్ని సూచనలు చేసింది. (1) ఇంపీరియల్ బాంకును, వివిధరాష్ట్రాలలో ప్రస్తుతం ప్రభుత్వాధికారంలోను, ప్రభుత్వం భాగస్వామిగాను ఉన్న బాంకులను కలిపివేసి ఒక స్టేట్ బాంకును నిర్మించడం. (ఇంపీరియల్ బాంకును జాతీయంచేసి స్టేట్ బాంకును నిర్మిస్తూ ప్రభుత్వం శాసనంచేసింది.) ఈ బాంకు ద్వారా గ్రామీణప్రాంతాలకు పరపతిసౌకర్యం కలిగించే నిమిత్తం వచ్చే ఐదుసంవత్సరాలలోను నూరు క్రొత్తశాఖలను నెలకొల్ప నిర్ణయించబడింది. (2) భారతప్రభుత్వమూ, రిజర్వు బాంకూ ఏటేటా యిచ్చే కేటాయింపులనుంచి రూ. 12 కోట్ల సొమ్మును, యిదిగాక ఆరంభంలో ఒకేసారి పెట్టుబడిక్రింద కేటాయించే మరో 10 కోట్లరూపాయలను కలిపి ఐదు జాతీయనిధులను ఏర్పరచడం. భారతప్రభుత్వంచే ఏర్పరచబడే యీ ఐదునిధులకు వివిధస్థాయిలలో రాష్ట్రప్రభుత్వాలు,

సహకార బాంకులు ఏర్పడచే అలాంటి సంస్థలకు ఋణాలు చేర్చ బడతాయి. (3) పరపతిసౌకర్యం కలుగజేయడమేగాక, సహకార మార్కెటింగు, ప్రోసెసింగు, తదితర సంఘాలను గ్రామం నుంచి అన్నిస్థాయిలలోను ఏర్పరచడం.

కేంద్రంలో ఒక జాతీయ సహకార అభివృద్ధి గిడ్డంగుల బోర్డు, ఒక జాతీయగిడ్డంగుల కార్పొరేషన్; రాష్ట్రస్థాయిలో ఒక సహకార బాంకు, ఒక గిడ్డంగుల కంపెనీ, ఒక సహకార మార్కెటింగ్ సొసైటీ; జిల్లాస్థాయిలో సహకార బాంకులు, మార్కెటింగ్ సొసైటీలు, భూమి తనఖా బాంకులు; క్రింద ప్రాథమిక స్థాయిలో వ్యాపకమైన పరపతి, మార్కెటింగ్, తనఖా బ్యాంకులు; మార్కెటింగ్ సొసైటీలు ఏర్పరచాలని సూచించ బడింది.

ఈ సూచనలు అసమగ్రంగా ఉన్నాయి. పల్లెలో వడ్డీ వ్యాపారి కార్యకలాపాలను అరికట్టే ప్రయత్నం లేదు, వడ్డీ వ్యాపారి, భూస్వామి, మామూలు వ్యాపారి, ప్రభుత్వాధి కారి - వీరందరి సంయోగం వలన ఏర్పడే "సంఘబలాలు, ప్రాబల్యం, ఆర్థిక పరస్పర అంతస్సంబంధాల గొలుసులను" బద్దలు చేయ పూనుకునే ప్రయత్నం దీనిలో ఎక్కడా కన బడదు. అలా చేయనంతకాలం యీ సమస్య పూర్తిగా పరిష్కారం కాదు.

అయినప్పటికీ యీ మొత్తం సూచనలు సక్రమంగా అమలు జరిగి నట్లయితే గ్రామీణ జనాభాకు తగినంత సహాయం అందు తుంది. వారు యీ క్రింది సౌకర్యాలను పొందగలుగుతారు. (1) వడ్డీవ్యాపారి విధిస్తున్న విపరీత వడ్డీ రేట్లనుంచి చాలా వర

రేట్లకు పరపతి దొరుకుతుంది. (2) వడ్డీవ్యాపారులలో ఒక వర్గం తన వడ్డీవ్యాపారాన్ని, మామూలు వ్యాపారంతో కలిపిచేస్తున్నది; యీ వర్గం వ్యవసాయదారునికి మార్కెట్లో గిట్టుబాటయ్యే ధరలను కోసివేయడానికి తన వడ్డీవ్యాపారాన్ని వినియోగించకుండా అరికడుతుంది. (3) వడ్డీవ్యాపారులలో మరోవర్గం మామూలు వ్యాపారంతోగాక భూయాజమాన్యంతో కలిసి (అంటే భూస్వామీ, వడ్డీవాంపాగి ఒక రే) పనిచేస్తున్నది. ఈ వర్గం రైతుల భూములను తనఖాద్వారా గాని, ప్రత్యక్ష కొనుగోలుద్వారాగాని కాజేయడనుండా అరికడుతుంది.

అయితే యీ సూచనలలో గ్రామీణ ప్రజానీకం నెత్తిమీదనున్న ప్రస్తుతపు విపరీత రుణభారాన్ని తగ్గించే విషయమే ఎత్తుకోలేదు. అలాగే భూస్వాముల దోపిడీ, పీడనలనుంచీ గ్రామీణ బీదప్రజానీకాన్ని విముక్తిచేయటానికే ప్రధానమైన సాంఘిక, ఆర్థికసమస్యతో గ్రామీణ పరపతి సౌకర్యపు సమస్యను జతపరచలేదు. ప్రస్తుత భూస్వామి - కౌలుదారు సంబంధాలను, రైతులు ఉత్పత్తిచేసేదాంట్లో అధికభాగం వారికే చెందునట్లు సమూలంగా మార్చివేసే తప్ప గ్రామీణ రుణభారం, పరపతి సమస్యకు పరిష్కారం దొరకదని యీ రిపోర్టు గమనించలేదు.

పైనచెప్పిన ప్రాథమికమైన సంస్కరణతోపాటు రుణ సమస్యను పరిష్కరించేదుకు ప్రభుత్వం యీ క్రిందిచర్యలు తీసుకోవలసియుంటుంది. (1) కేంద్రప్రభుత్వం గ్రామీణ రుణసౌకర్యాల నిమిత్తం సంవత్సరానికి రూ. 250 కోట్లనైనా

కేటాయించాలి. (2) స్టేట్ బాంకు గ్రామీణ ఋణాలను నేరుగా తన శాఖలద్వారానే పంచిపెట్టాలి. అట్టి అప్పులు రైతులందరికీ - వారు భూమిగలవారైనా, కౌలుదారులైనా - వ్యవసాయిక అవసరాలనుబట్టి యివ్వాలి. స్థిరాస్థుల హామీ పద్ధతిని రద్దుచేయాలి. (3) ఇదివరకే రైతుల నెత్తిపైనున్న ఋణభారాన్ని తగ్గించేందుకు తక్షణమే తగుచర్యలు తీసుకో వాలి. అలా తగ్గించాక మిగిలిన అప్పులను దీర్ఘకాల వాయిదాలలో తీర్చేందుకు వీలుకలిగించాలి. దీనికిగాను ఋణ పరిష్కార సంఘాలను నియమించాలి. (4) గ్రామీణ ప్రజల పరపతి అవసరాలకు కేటాయించే మొత్తంలో (రు. 250 కోట్లు) కనీసం రు. 20 కోట్లు భూమిలేని వ్యవసాయ కార్మి కుల అవసరాలకు ప్రత్యేకించాలి. (5) ఈలోగా రైతులు వడ్డీవ్యాపారస్థులకు, భూస్వాములకు బాకీఉన్న అప్పులపైన మారిటోరియం ప్రకటించాలి.

# మార్కెటింగ్ సౌకర్యాలు_వ్యవసాయ సరకుల ధరలు

ఈనాడు మన గ్రామీణ వ్యవస్థలో పెట్టుబడిదారీ ఆర్థికసంబంధాలు పెంపొందుతూండటంతో మన రైతాంగం పెట్టుబడిదారీ మార్కెట్ యొక్క విషకౌగిలిలోనికి యింకా ఎక్కువగా యీడ్వబడ్డారు. తాము ఉత్పత్తిచేసిన సరుకును బయట మార్కెట్లలో అమ్మడం, అలాగే తనకవసరమైన పారిశ్రామిక సరుకులను అచట కొనడం అవసరమయ్యాయి. మార్కెట్లో అమ్ముతున్న తన సరుకుకు సరియైన ధరవచ్చినప్పుడే రైతుయొక్క పరిస్థితి బాగుపడడం, తద్వారా వ్యవసాయాభివృద్ధి జరగడమూ సాధ్యమవుతుంది. కాని యీనాడు సరియైన మార్కెట్ సౌకర్యాలు లేనందున మన రైతాంగం అనేకవిధాల బాధలకు, ఆర్థికనష్టానికి గురిగావడం జరుగుతూంది.

మనదేశంలో కొద్ది ప్రదేశాలలో మాత్రమే మార్కెట్లు అభివృద్ధి అయ్యాయి. గ్రామసీమలనుండి ఆ మార్కెట్లకు సరుకును చేరవేసేందుకు సరియైన రవాణా సౌకర్యాలు లేవు. ఒకవేళ కష్టపడి మార్కెట్లకు సరుకును తీసుకొనివెళ్ళినా అచట జరిగే అన్యాయాలు అనేకం. దొంగ తూకాల మోసం; కూలీలకు, గుమాస్తాలకు, ధర్మానికి, పండుగలకు, పబ్బాలకు, చందాలు; ఇవిగాక మ్యునిసిపల్ పంచాయతీల పన్నులు వగైరాలద్వారా రైతుల అమ్మకంలో దాదాపు 10% కాజేయబడుతూంది.

అదేవిధంగా మనదేశంలో యింకా కో-ఆపరేటివ్ అమ్మకపు సొసైటీలుగాని, మార్కెటింగ్ సొసైటీలుగాని అభివృద్ధిగాలేదు. రైతాంగం తమ సరుకుకు సరియైనధర వచ్చేవరకు నిల్వచేసేందుకు స్టోరేజి గిడ్డంగులు లేవు. తత్ఫలితంగా యెక్కువభాగం వ్యవసాయసరుకు గ్రామాలలోనే అప్పులవానికో, గ్రామాలవెంట తిరిగి సరుకును కొనే వ్యాపారస్థునికో, అవసారాన్నిబట్టి చౌకధరలకు అమ్మివేసుకో వలసి వస్తూంది. కొద్దిభాగం మాత్రమే చుట్టుపక్కల మార్కెట్లకు తీసుకువెళ బడుతూంది. అచటకూడ వ్యాపారుల దయాదాక్షిణ్యాలనుబట్టి వారు నిర్ణయించిన ధరలకే అమ్మ వలసి వస్తూంది.

ఇక మన వాణిజ్యపంటలలో అధికభాగం, ముఖ్యంగా విదేశాలకు ఎగుమతిచేయబడుతున్న వేరుసెనగ, పసుపు, పొగాకు వగైరాలయొక్క; మన పరిశ్రమల కవసరమైన ముడి జనపనార, ప్రత్తి వగైరాలయొక్క కొనుగోలు అత్యధికభాగం విదేశీ గుత్తవ్యాపారస్థుల చేతులలో వుంటూంది. వారు తమ ఇచ్చవచ్చినట్లు సీజనులో ధరలు తగ్గించడం, తరువాత ధరలుపెంచి విదేశీ మార్కెట్లలో కోట్లాది రూపాయలు లాభం సంపాదించడం జరుగుతూంది. ఉదాహరణకు పసుపుధర యీ సంవత్సరం పుట్టి 1 కి రు. 90-95 కు పడిపోయింది. అలాగే వర్జీనియా పొగాకు ధర యీ యేడు సీజన్లో పుట్టి 1 కి రూ. 200/- వరకు కోత కోయబడింది. నాటుపొగాకుధర గత ఏడాది పుట్టి 1కి రు. 700 వుంది. యీ ఏడాది రు. 400 - 450 లకు మించలేదు.

పై కారణాలవలన వ్యవసాయపంటల మార్కెట్ పూర్తిగా దేశీయ, విదేశీయ వ్యాపారస్థుల, గుత్తపెట్టుబడి దారుల చేతులలో ఉండిపోయింది. వీరు వ్యాపారంపై తమకు గల గుత్త యాజమాన్యాన్ని ఉపయోగించుకుని రైతులు పంటలమ్ముకునే సీజనులో ధరలను బాగా తగ్గించి కొనడం, సరుకు తమచేతులలోకి చేరినపిమ్మట చుక్కలంటా ధరలను పెంచడం చేస్తున్నారు. తత్ఫలితంగా యిటు సాధారణ రైతాంగము, అటు వాడకందారులుకూడా తీవ్ర నష్టానికి గురిఅవుతున్నారు. రైతులకు సరియైన ధర గిట్టక, మార్కెట్ ఒడుదుడుకులకు గురియై చితికిపోవుట, ఫలితంగా వ్యవసాయ పెట్టుబడికి డబ్బు మిగలక వ్యవసాయోత్పత్తి దెబ్బతింటూంది.

దీనికి ప్రధాన కారణాలలో ఒకటి వ్యవసాయపంటలకు రెగ్యులేటెడ్ మార్కెట్లు లేకపోవడం, కో-ఆపరేటివ్ అమ్మకపు సొసైటీలు, మార్కెటింగ్ సొసైటీలు విరివిగా అభివృద్ధి గాకపోవడం, స్టోరేజి గిడ్డంగులు లేకపోవడమే.

ఈ మధ్యకాలంలో అక్కడక్కడా కొన్ని కో-ఆపరేటివ్ అమ్మకపు, మార్కెటింగు సొసైటీలు ఏర్పడి పని చేస్తున్నాయి. కాని అవి చాలాతక్కువ సంఖ్యలో మాత్రమే ఉన్నాయి.

ప్రభుత్వం మార్కెటింగు, వేర్‌హౌసింగు సౌకర్యాలు కలిగించేందుకు చేసినకృషి చాలాతక్కువ. 1934 లో బ్రిటిష్ ప్రభుత్వం ఒక వ్యవసాయ మార్కెటింగు సలహా దారును నియమించింది. 1937 లో వ్యవసాయోత్పత్తి

(గ్రేడింగ్ అండ్ మార్కెటింగు) ఆక్టును ప్యాసుచేసింది. దీనిప్రకారం నెయ్యి, కోడిగ్రుడ్లు, పిండిపదార్థాల గ్రేడింగ్ నిమిత్తం అచ్చటచ్చట గ్రేడింగ్ స్టేషన్లను నెంకొల్పింది.

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో భారత ప్రభుత్వం సూనెగింజలు, పొగాకు, జీడిపప్పు, ఉన్ని వగైరా లను గ్రేడ్ చేయుటకు, వేరుసెనగ వగైరా కంట్రాక్టుషరతులను ప్రమాణీకరించేందుకు, మార్కెట్ వార్తలను విరివిగా అందించేందుకు గాను 86 లక్షల 50 వేల రూపాయలు కేటా యించబడ్డాయి. కొన్ని రాష్ట్రాలలో రెగ్యులేటెడ్ మార్కెట్లు ఏర్పరచబడ్డాయి. 1951 నాటికి దేశం మొత్తంమీద 283 రెగ్యులేటెడ్ మార్కెట్లుండేవి. ఈనాడు 450 మార్కెట్లు ఏర్పాటయ్యాయి. రెండవ ప్రణాళిక ఆఖరుకు వీటిని రెట్టింపు చేయ సంకల్పించబడింది.

రూరల్ క్రెడిట్ సర్వేరిపోర్టు ననుసరించి 1956 ఫిబ్ర వరిలో పార్లమెంట్‌లో వ్యవసాయోత్పత్తి (అభివృద్ధి అండ్ వేర్‌హౌసింగ్) కార్పొరేషన్ బిల్లు తయారుచేయబడింది. దీనిప్రకారం కేంద్రజాతీయ కో-ఆపరేటివ్ డెవలప్‌మెంట్ అండ్ వేర్‌హౌసింగ్ బోర్డును, అలాగే కేంద్ర వేర్‌హౌసింగ్ కార్పొరేషన్‌ను నెలకొల్పుతారు. రాష్ట్రాలలో వీటిశాఖలు నిర్మించబడతాయి. కాని యివి యింకా పూర్తిగా అమలు లోనికి రాలేదు. గిడ్డంగుల నిర్మాణం అక్కడక్కడ కొద్దిగా సాగుతూంది.

# రైతాంగంపై అధిక పన్నులు

పై రెండు అధ్యాయాలలోను రైతాంగం పరపతి సౌకర్యాలు లేక ఏవిధంగా ఋణాలపాలయిపోతుందో; మార్కెటింగ్ సౌకర్యాలు లేక, తమసరుకుకు సరియైన ధర గిట్టక మార్కెట్ ఒడుదుడుకులకు, వ్యాపారుల అన్యాయాలకు గురియై వ్యవసాయోత్పత్తికి పెట్టుబడులు లేక ఎలా బాధ పడుతూందో చూచాము. మూలిగే నక్కపైన తాటిపండు వలె అసలే ఋణభారంతో క్రుంగిపోతున్న రైతాంగంపైన భారతప్రభుత్వం అభివృద్ధి ప్రణాళికల ఖర్చులపేరుతో మోయలేనంత పన్నులభారాన్ని కూడా వేస్తూంది.

అసలు మనదేశంలో భూమిశిస్తు అసెస్‌మెంటుకు ఒక క్రమపద్ధతేమీ లేదు. అనేకపద్ధతు లవలంబించబడుతున్నాయి. నికర ఫలసాయంలో యిన్ని వంతులని కొన్నిచోట్ల, కౌలు శిస్తులో యింతభాగమని కొన్నిప్రాంతాలలో, ఎప్పటి కప్పుడు ఆనాడున్న పరిస్థితులను, ధరవరలనుబట్టి కొన్నిచోట్ల భూమి శిస్తు నిర్ణయించబడుతూంది. స్వాతంత్ర్యానంతరం జమీం దారీ, జాగీర్‌దారీ విధానాల రద్దుజరిగిన పిమ్మట ఒకే ఒక భూమిశిస్తు విధానం, రైత్వారీవిధానం, అమలులోనికి వస్తూంది. కాని శిస్తుభారం మాత్రం పెద్దగా తగ్గలేదు. పైగా రానురాను ప్రణాళికల ఖర్చునిమిత్తం రైతాంగంపైన పన్నుల భారం క్రమానుగతంగా పెంచబడుతూంది.

దీనిని సమర్థించుకునేందుకు కొన్ని తప్పువాదనలు కూడా తీసుకురాబడుతున్నాయి. ఈ మధ్యకాలంలో వ్యవసాయ సరుకుల ధరలు క్రమంగా పెరుగుతున్నాయి గాన జాతీయాదాయంలో రైతాంగం వంతు పెరిగిందని, కాబట్టి వారిపైన పన్నులు అధికంజేయడం న్యాయమేనని పెట్టుబడిదారులు, భూస్వాముల ప్రతినిధులతో కూడిన పన్నుల పరిశీలనా కమిటి (Taxation Enquiry Committee) సూచించింది. ఇది ఎంతవరకు యదార్థమో పరిశీలించవలసియున్నది.

1944 – 55 సంవత్సరాల మధ్య వ్యవసాయసరుకుల ధరలు యీ క్రిందివిధంగా పెరిగాయని ప్రభుత్వ లెక్కలే తెలుపుతున్నాయి.

| సంవత్సరం. | ఆహార పదార్థాల ధరల సూచీ. | | వ్యాపారపంటల ధరల సూచీ. |
|---|---|---|---|
| 1938 – '39 (ప్రాతిపదిక సంవత్సరం) | 100 | ... | 100 |
| 1944 – '45 ... | 306.1 | ... | 377.5 |
| 1950 – '51 ... | 416.4 | ... | 523.1 |
| 1953 – '54 ... | 384.4 | ... | 467.7 |
| 1954 – '55 ... | 316.1 | ... | 436 5 |
| 1955 (ఏప్రిల్) ... | 286.4 | ... | 399.1 |

(Growing Tax Burdens On The Peasantry అనే అఖిలభారత కిసాన్‌సభ కరపత్రంనుండి)

(అయితే 1956 తరువాత వ్యవసాయ సరుకుల ధరలు పెరిగాయన్న విషయం గమనించవలసి వున్నది.)

ఇక వ్యాపారపంటల విలువ యీ మధ్యకాలంలో యీ క్రిందివిధంగా పడిపోయిందని బిర్లాగారి 'ఈస్టరన్ ఎకానమిస్టు' పత్రికే అంచనా వేసింది : (కోట్లరూపాయలలో)

| పంట | | 1950–'51 | 1953–'54 | తక్కువా ఎక్కువా? |
|---|---|---|---|---|
| నూనెగింజలు | ... | 487 | 457 | – 30 |
| చెరకు | ... | 305 | 214 | – 91 |
| ప్రత్తి | ... | 113 | 145 | + 32 |
| జనపనార | ... | 58 | 40 | – 18 |

పై టేబిల్స్ తెలియజేస్తున్న దేమిటి ? వ్యవసాయ సరుకులధరలు 1950–51 లో (కొరియగాయుద్ధ వాతావరణంలో) పెరిగినప్పటికి తరువాత క్రమంగా కొంతకాలం వరకూ పడి పోతూ వచ్చాయి. మొత్తంమీద సగటున వ్యవసాయసరుకుల ధరలు 3–3½ రెట్లకన్న పెరగ లేదని విశదమౌతుంది. 1953 లో మొత్తం వ్యవసాయోత్పత్తుల విలువ 5330 కోట్ల రూపాయ లుంటే 1955–56 లో వాటివిలువ రూ. 1000/– కోట్లమేరకు తగ్గిపోయిందని ఈస్టరన్ ఎకానమిస్టు అంచనా వేసింది.

వ్యవసాయాదాయాన్ని అంచనా వేసేటప్పుడు మరొక విషయంకూడా దృష్టిలో పెట్టుకోవాలి. వ్యవసాయసరుకుల ధరలు సగటున 3–3½ రెట్లు పెరిగితే రైతాంగం కొనుక్కోవలసిన పారిశ్రామిక వస్తువులధరలు 5–8 రెట్లవరకు పెరిగాయి. ఫలితంగా రైతుల ఆదాయంలో కొంతభాగాన్ని పెట్టుబడి దారులు కాజేస్తున్నారన్న విషయాన్ని విస్మరించకూడదు.

వ్యవసాయాదాయం యొక్క పరిస్థితి యీ విధంగా ఉంటే వ్యవసాయాదాయాలు పెరుగుతున్నాయనే నెపంతో ప్రభుత్వం క్రమంగా భూమిపన్నును పెంచుకుంటూ పోతూంది.

ఉదాహరణకు 1933-'39 లో రూ. 26 కోట్లుగా నున్న భూమి పన్ను 1953-54 లో 70 కోట్ల రూపాయలకు పెంచబడింది. దీనితోపాటు రైతాంగంపైన అనేక యితర ప్రత్యక్ష, పరోక్షపన్నులు విధించబడుతున్నాయి.

(1) భూమిసిస్తుపై సర్‌చార్జి :- ఇది దాదాపు అన్ని రాష్ట్రాలలోను విధించబడుతోంది. 1938-'39 లో యీ పద్దు క్రింద రు. 5.02 కోట్ల ఆదాయం వస్తే, 1952 లో అది 8.04 కోట్లకు పెరిగింది. దరిమిలా ప్రతి సం॥ మూ పెరుగుతోంది.

(2) ఇరిగేషన్ చార్జీలు:- నీటి క్రిందకూడ పెట్టిన పెట్టుబడి ఖర్చులకన్న ఎక్కువే రాబట్టబడుతూంది. కొన్ని రాష్ట్రాలలో నీటి తీరువాలు 50% నుంచి 200% వరకు పెంచబడ్డాయి.

(3) అభివృద్ధి పన్ను :- నీటిపారుదల సౌకర్యాలు కలిగించిన చోట్లనల్లా యీ పన్ను విధించబడుతూంది. భాక్రా ప్రాజెక్టు క్రింద 22 లక్షల ఎకరాలపైన రూ. 78 కోట్లు, హీరాకుడ్ ప్రాజెక్టు క్రింద ఎకరాకు రూ. 125/- చొప్పున 14 కోట్ల 70 లక్షల రూపాయలు, యిలాగే ప్రతి ప్రాజెక్టు క్రింద, అభివృద్ధి లెవీలు విధించబడుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్ లో యీ మధ్య కాలంలో అనేకరకాలైన పన్నులు - పైపన్నులు గాక వాణిజ్యపంటల పన్ను, చెరుకు గానుగల సెస్సులు, ఫసలీ జాస్తీలు, పెనాల్టీలు వగైరాలు - విధించబడిన సంగతి అందరికీ తెలిసినదే.

రెండవ ప్రణాళికా కాలంలో వివిధరాష్ట్రాలలో యిది వరకున్న విగాక అదనంగా భూమిశిస్తు పన్ను రూ. 37 కోట్లు,

వ్యవసాయాదాయాలపై పన్ను రు 12 కోట్లు, అభివృద్ధిపన్ను రూ. 16 కోట్లు, నీటి తీరువాలు రూ. 11 కోట్లు, మొత్తం రూ. 76 కోట్లు పెంచాలని ప్రణాళికా సంఘం సూచించింది.

ఈ విధంగా క్రమానుగతంగా భారత రైతాంగంపైన రుణభారంతోపాటు పన్నులభారం కూడా పెరుగుతూండడం వలన రైతు వ్యవసాయ పెట్టుబడులకు తగినడబ్బు పెట్టలేకపోతున్నాడు. వ్యవసాయోత్పత్తులను పెంచేందుకు తగిన స్తోమతు, ఉత్సాహము, ప్రోత్సాహమూ, లేకుండా పోతున్నాయి.

అంతేగాదు యీ నాటి భూమిశిస్తు విధానం అక్రమంగాను, అన్యాయంగాను ఉన్నది. ఆదాయాన్నిబట్టి గాక ఎకరాలనుబట్టి పన్ను విధించబడుటవలన వందలకొలది ఎకరాలుగల భూస్వాములపైన ఏ రేటున శిస్తు విధించబడుతుందో అదే రేటున సెంటు, కుంట భూమిగల బక్కరైతుల పైన కూడా విధించబడుతూంది. ఈ అక్రమవిధానాన్ని రద్దుచేసి, తక్కువ ఆదాయాలు వచ్చే రైతాంగంపై పన్ను మినహాయించి, మిగిలిన వ్యవసాయాదాలపైన వృద్ధి క్రమానుసారంగా భూమిపన్నును విధించాలని మన దేశంలోని రైతు ఉద్యమమూ, ప్రజాస్వామికోద్యమమూ ఎంతో కాలంనుండి ఆందోళన చేస్తున్నాయి. కాని సామ్రాజ్యవాద బ్రిటిష్ ప్రభుత్వంవలెనే మన భారత ప్రభుత్వంకూడ యీ విధానాన్ని సంస్కరించేందుకు నిరాకరిస్తూ వస్తూంది. ఈ సంస్కరణ సాధించబడేవరకు బీదరైతాంగం పన్నులభారంతో కృంగిపోక తప్పదు.

# వ్యవసాయ కార్మికులు

వ్యవసాయోత్పత్తిలో ప్రముఖపాత్రను నిర్వహించే మన వ్యవసాయ కార్మికుల సమస్య గ్రామీణ వ్యవస్థలో ఒక తీవ్రమైన సమస్యగా ఉంటున్నది. మన దేశంలో అన్నివర్గాల ప్రజలకన్న ఆర్థికంగాను, సాంఘికంగాను అట్టడుగున ఉన్న వర్గం, అందరికన్న ఎక్కువ అశ్రద్ధ చేయబడిన వర్గం, హీన స్థితిలోనున్న వర్గం యీ దేశని చెప్పాలి. ఆకలి, నిరుద్యోగం, అనాగరికత, అవిద్య వగైరాలన్నీ కట్టగట్టుకుని వీరి దైనందిన జీవితంలో ప్రతిబింబిస్తుంటాయి.

సంఖ్య :- 1951 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో ఉన్న 24 కోట్ల 90 లక్షల వ్యవసాయ జనాభాలో వ్యవసాయ కార్మికులు 4 కోట్ల 90 లక్షల వరకు ఉన్నారు. మొత్తం గ్రామీణ కుటుంబాలలో 30.4 శాతం వరకు వ్యవసాయ కార్మిక కుటుంబాలున్నట్లు వ్యవసాయ కార్మిక ఎంక్వయిరీ కమిటీ తెలియజేస్తూంది. కొన్ని రాష్ట్రాలలో 42% దాకా ఉన్నాయి.

ఉద్యోగవసతులు :- 1950 - 51 లో ప్రభుత్వం నిర్వహించిన వ్యవసాయ కార్మిక స్థితిగతుల పరిశీలన ప్రకారం సంవత్సరం మొత్తంమీద సగటున పురుష వ్యవసాయ కార్మికులకు 218 రోజులు మాత్రమే వ్యవసాయపు పనులు దొరుకుతున్నాయని, మరొక 49 రోజులు స్వయంగా యితర పనులు చేసుకుంటున్నారని, 98 రోజులు పూర్తిగా నిరుద్యోగులుగా

ఉంటారని తేలింది. మద్రాసు (ఆంధ్రతో సహా), మైసూరు, తిరువాన్కూర్ - కొచ్చిన్, బొంబాయిలాంటి ప్రధాన రాష్ట్రాలలో 4 నెలలకు పైగా నిరుద్యోగులుగా ఉంటున్నారని చెప్పబడింది. వ్యవసాయ కార్మికులలో మగవారిలో దాదాపు 16% మందికి అసలెట్టి పనులూ లేక పూర్తి నిరుద్యోగులుగా ఉంటున్నారు.

అయితే యీ అంచనాలలో స్త్రీలకు సంవత్సరంలో ఎన్నిరోజులు పనిదొరుకుతుంది? నిరుద్యోగంతో ఉండే స్త్రీలు, 10 సం॥లు దాటిన బాలురు ఎంతమంది? అనే విషయాలు సేకరించబడలేదు. మన అనుభవంలో స్త్రీలకు, పిల్లలకు, పురుషులకన్న చాల తక్కువకాలమే పని దొరుకు తుందని అందరికీ తెలిసిన విషయమే. అందువలన వాస్తవానికి నిరుద్యోగం ప్రభుత్వ అంచనాలకు మించేఉంటుందనే దానిలో సందేహంలేదు.

మనదేశంలో పనిచేసే వయస్సుగల వ్యవసాయ కార్మికులు 3 కోట్ల 54 లక్షలమందికి 16 శాతం, అంటె 56 లక్షల 6 వేలమంది పూర్తి నిరుద్యోగులని తేలుతుంది. వీరుగాక పాక్షిక ఉద్యోగం దొరికేవారు నిరుద్యోగులుగా ఉండే రోజులను మనుష్యుల సంఖ్యలోనికి మార్చినట్లయితే వీరొక 32 లక్షల 30 వేలమంది పూర్తి నిరుద్యోగులు తేలుతారు. అంటే మొత్తం వ్యవసాయ కార్మికులలో నిరుద్యోగం, మనుష్యుల సంఖ్యలో చెప్పాలంటే 88 లక్షల 90 వేలకు

తక్కువ ఉండదు. (కె.పి. సుబ్రహ్మణ్యమీనన్‌గారి "నిరుద్యోగ సమస్య" అనే పుస్తకంలోనుండి యీ వివరం సేకరించబడింది.)

పోతే కాంట్రాక్టుపైన భూస్వాముల దగ్గర సంవత్సరమంతా కొలువుకు కుదిరే పాలేరులకు ఉద్యోగవసతి ఉంటుందన్న మాటేగాని బ్రతుకు అధ్వాన్నంగా ఉంటుంది. దాదాపు రోజుకు 12 - 20 గంటలవరకు పని ఉంటుంది. సెలవులుండవు. వ్యవసాయపు పనులేగాక యింటిపనులతో సహా బండచాకిరీ చేయవలసియుంటుంది.

కూలిరేట్లు - ఆదాయ వ్యయాలు :- వీరి కూలి రేట్లు, ఆదాయము మనదేశంలో సంపాదనపరులందరికన్న తక్కువగా ఉంటున్నది. భారతప్రభుత్వం ప్రచురించిన లెక్కలప్రకారమే దేశం మొత్తంమీద వ్యవసాయ కార్మికులకు, పురుషులకు సగటు రోజుకూలి రు. 1-2-6, స్త్రీకి రు. 0-10-8 ఉంటుందని తెలుస్తుంది. ఇది సగటు కూలిమాత్రమే. కొన్ని రాష్ట్రాలలో యింతకన్న తక్కువే ఉంటుంది. ఉదాహరణకు మధ్యప్రదేశ్, మధ్యభారత్, హైదరాబాద్ (ప్రాంతాలలో సగటు కూలి) పురుషునికి రు. 0-12-0, స్త్రీలకు రు. 0-8-0 మాత్రమే ఉన్నది.

ఆంధ్ర ప్రాంతంలో వ్యవసాయ కార్మికుల కూలిరేట్లు తీసుకుంటే, విశాఖజిల్లాలో రు. 0-8-0 నుండి రు. 1-4-0 వరకు; రాయలసీమ జిల్లాలలో రు. 0-8-0 నుండి రు. 0-12-0 వరకు (మధ్యాహ్నం సంకటి పెట్టబడుతుంది); కృష్ణా - గుంటూరు జిల్లాలలో వరికోతలలో రు. 1-0-0 నుండి

రు. 1-8-0 వరకు, మాన్సూళ్లు కుప్పల తరుణంలో రు. 1-8-0 నుండి రు. 2-0-0 వరకు, మెట్ట ప్రాంతాలలో రు. 1-0-0 నుండి 1-4-0 వరకు రోజుకూలి గిడుతుంది.

పాలేర్లకు రోజుకు 12-14 గంటలవరకు డెల్టాజిల్లాల లోను, రాయలసీమలో రోజంతాను పనిఉంటుంది. ఇక వీరి జీతాలుచూస్తే తూర్పుగోదావరిలో 12-20 బస్తాల ధాన్యం, పశ్చిమగోదావరిలో 16-20 బస్తాలధాన్యం, కృష్ణా, గుంటూరు జిల్లాలలో 20-24 బస్తాల ధాన్యం, రాయలసీమలో అన్నం, వక్కాకు, చుట్ట, పంచలు వగైరాలతో పాటు రు. 150/- 250 వరకు సంత్సరానికి యివ్వబడుతుంది.

దేశం మొత్తంపైన వ్యవసాయ కార్మికులకు సంవత్సరం మొత్తంమీద సగటున తలసరి ఆదాయం రూ. 104/- ఉంటుందని ప్రభుత్వ పరిశీలనవలన తేలింది. దేశంలో మొత్తం కుటుంబాలలో 22.7% గా ఉన్న వ్యవసాయ కార్మిక కుటుం బాలకు వచ్చే మొత్తం ఆదాయం మన జాతీయాదాయంలో 8.3% మాత్రమే ఉంటుందని తేలింది. వారికి వచ్చే యీ కొద్దిపాటి ఆదాయంలో తిండికి 85%, మిగిలిన వాటన్నింటికి కలిపి 15% ఖర్చుపెడుతున్నారని కూడా చెప్పబడింది. దీనిని బట్టి వారు ఎంత పుష్టిహీనమైన ఆహారం తీసుకొంటారో, బట్టలు, గృహవసతి, విద్యా వినోదాలకు ఎలా నోచుకోలేక పోతున్నారో స్పష్టంగా అర్ధమవుతుంది. ఈ క్రింది టేబిల్‌ను పరిశీలిస్తే వారి జీవితం ఎంత అధ్వాన్నంగా ఉన్నదో అర్ధ మవుతుంది :

## వ్యవసాయకూలి కుటుంబం యొక్క సగటు ఖర్చు. (రూపాయలలో)

| జోన్ నెం. | రాష్ట్రం పేరు. | ఆహారం | బట్టలు చెప్పులు | వంటచెరకు దీపం | ఇంటి అద్దె మరమ్మతులు | అనామతు | మొత్తం. |
|---|---|---|---|---|---|---|---|
| 1. | యు. పి. | 464 | 48 | 6 | 4 | 31 | 548 |
| 2. | అస్సాం, బీహార్, ఒరిస్సా, ప. బెంగాల్ | 464 | 26 | 6 | 5 | 27 | 528 |
| 3 | మద్రాస్, మైసూర్, తిరువాన్కూర్, కొచ్చిన్ | 323 | 27 | 5 | 5 | 37 | 397 |
| 4. | బొంబాయి, సౌరాష్ట్రం | 327 | 34 | 7 | 2 | 22 | 392 |
| 5. | మధ్యప్రదేశ్, మధ్యభారత్, హైదరాబాద్ | 374 | 26 | 4 | 1 | 23 | 428 |
| 6. | రాజస్థాన్, పంజాబ్, జమ్మూ - కాశ్మీర్ | 571 | 52 | 6 | 3 | 42 | 674 |
| | మొత్తం | 393 | [illegible]9 | 5 | 4 | 30 | 461 |

కనీస వేతనాలు :- శ్రీ కుమారప్పగారి అధ్యక్షతన కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల కమిటి తన నివేదికలో (1946) వ్యవసాయ కార్మికుల కనీస వేతన నిర్ణయం యీ క్రింది ప్రాతిపదికపై జరగాలని సూచించింది. (i) పనిచేసిన రోజున అయినా కావలసిన కనీస అవసరాలను తీర్చుటకు సరిపోయే మొత్తాన్ని కనీస వేతనంగా నిర్ణయించాలి. (ii) వివిధ పంటల తరుణాలలో, అంటే సీజను మారినప్పుడల్లా, కనీస వేతనాలు నిర్ణయించాలి. కనీస వేతనాలు ధాన్యరూపంలోను, ధనరూపం లోను నిర్ణయించాలి. (iii) ఆ యా ప్రాంతాల జీవన ప్రమాణం, శ్రామికుల జీవన ప్రమాణం రెండింటినీ కూడా దృష్టిలో వుంచుకొని కనీస వేతనాలు నిర్ణయించాలి.

ఈ సూచనలు ఆచరణయోగ్యంగాను, ఆమోదకరం గాను ఉన్నాయి. కాని కేంద్ర ప్రభుత్వం ఏ ప్రాతిపదికను సూచించకుండానే 1948 లో కనీస వేతనాల చట్టాన్ని తయారు చేసింది. దాని ప్రకారం రాష్ట్ర ప్రభుత్వాలు వేతనాల నిర్ణాయక కమిటీల నేర్పరచి వాటి సలహాల ననుసరించి కనీస వేతనాలను నిర్ణయించడంగాని లేక రాష్ట్ర గవర్నర్లు నిర్ణయించి ప్రకటించడంగాని చేయవచ్చునని సూచించబడింది. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రమే రెండవ పద్ధతి ననుసరించి కనీస వేతనాలను నిర్ణయించాయి.

ఇలా కనీస వేతనాలను నిర్ణయించి ప్రకటించిన చోట్ల కూడా అదివరకు మామూలుగా అమలులోనున్న వేతనాల కన్న తక్కువగా నిర్ణయించబడ్డాయి. ఉదాహరణకు 1952 డిశెంబరు 17 న ఉమ్మడి మద్రాసు ప్రభుత్వ గవర్నరు యీ

క్రింది రేట్లను నిర్ణయిస్తూ ప్రకటన చేశారు. నాగలి దున్నటకు రు. 1-8-0, విత్తనాలు జల్లుటకు రు. 0-12-0, కోతకోయుటకు రు. 0-12-0, కలుపులకు రు. 0-12-0 నిర్ణయించబడింది. ఈ రేట్లనే ఆంధ్రప్రాంతంలో 14 మాసములు గ్రామాలలో అమలు జరిపింది మన ఆంధ్ర ప్రభుత్వం. దీనినిబట్టి ప్రభుత్వం అట్టడుగున పడియున్న వ్యవసాయకార్మిక వర్గ జీవిత పరిస్థితులను బాగుచేసేందుకు కృషి చేయడంలేదని స్పష్టమవుతోంది.

ఋణభారం :- సంవత్సరంలో 3-6 నెలలవరకు పనిలేక పోవుటవలన, పనిదొరికిన రోజులలోకూడా కూలీ రేట్లు చాలా తక్కువగా ఉన్నందువలననూ, కనీస జీవితావసరాల ధరలు పెరిగిపోతూన్నందువలననూ వ్యవసాయ కార్మిక కుటుంబాలు రానురాను అప్పులపాలై పోతున్నారు. దేశం మొత్తంపైన ప్రభుత్వం సేకరించిన లెక్కలప్రకారం వ్యవసాయ కార్మిక కుటుంబాలలో నూటికి 44.5 వంతులు అప్పులపాలయినట్లు తెలుస్తుంది. ఒక్కొక్క కుటుంబానికి సగటు అప్పు రు. 105/- దాకా ఉన్నది.

కొన్ని ప్రత్యేక రాష్ట్రాలలో తీసుకుంటే యీ సగటు అప్పులభారం మరీ ఎక్కువగా ఉన్నది. ఉదాహరణకు హైదరాబాద్ ప్రాంతంలో రు. 145/-, పెప్సూలో రు. 318/- పంజాబ్‌లో రు. 341/-, రాజస్థాన్‌లో రు. 347/-, ఢిల్లీలో 646/- ఉన్నది.

ఈ అప్పులలో అధికభాగం కరువు కాలంలో గ్రామాల లోని భూస్వాముల దగ్గర చేసినవే. వ్యవసాయ కార్మికులకు హామీలు పెట్టగల ఆస్తిపాస్తులు లేనందువలన సహకార

సంఘాలనుండిగాని, ప్రభుత్వంనుండి గాని అప్పులు లభించక పోవుటచే తప్పనిసరై భూస్వాముల దగ్గరే పుచ్చుకోవలసి వస్తూంది. ఫలితంగా అధికవడ్డీలతో ఆ అప్పులు పెరిగిపోయి, తీర్చుకునే స్తోమతులేక భూస్వాములకు శాశ్వత బానిసలై ఊడిగం చేయవలసి వస్తూంది.

ఇండ్లస్థలాలు, మంచినీరు, తదితర వసతులు:- వ్యవసాయ కార్మికులలో అధికభాగం వెనుకబడిన కులాలనుండి వచ్చినవారు గానడంవలన వీరు సాంఘికంగా అనేక యిబ్బందులకు గురిగావలసి వస్తూంది. సవర్ణులుండే ఊరికి దూరంగా మురికి కూపాలలో వీరు చాలీచాలని యిరుకుస్థలాల్లో నివసించవలసి వస్తూంది. మంచినీటి సౌకర్యాలు గాని, బాటలు గాని, శ్మశాన సౌకర్యాలు గాని చాలా తక్కువగా ఉంటున్నాయి. ఇక వీరి పిల్లల చదువు సంధ్యలకు అసలే అవకాశముండదు.

ఈ సౌకర్యాలను కలిగించుటలో ప్రభుత్వం చాలా అశ్రద్ధ చూపుతూంది. వీరి యిండ్లస్థలాలకు మొదటి పంచవర్ష ప్రణాళికలో రు. 3 కోట్లు మాత్రమే కేటాయించింది. రెండవ ప్రణాళికలో దానిని రు. 10 కోట్లకు పెంచింది. కాని యీ సొమ్ము వ్యవసాయ కార్మిక కుటుంబాల సంఖ్యను, వారి అవసరాలను దృష్టిలో పెట్టుకున్నపుడు ఏమాత్రమూ చాలదని, కన్నీళ్లు తుడుచుటకు మాత్రమే పనికివస్తుందని స్పష్టమవుతుంది. రెండవ ప్రణాళికాకాలంలో 85 వేల ఇండ్లుకట్టించాలని, 23 వేల నూతులు త్రవ్వించాలని పధకాలు వేయబడ్డాయి. కాని యీ కార్యక్రమంకూడా చాలా మందకొడిగా అమలుజరుగుతూంది.

ఆచరణలో అనేక అడ్డంకులు ఏర్పడుతున్నాయి. ఇండ్ల స్థలాలకు భూములను నిర్ణయించిన పిమ్మట వాటిని స్వాధీనం చేసుకునేందుకు కొన్ని సంవత్సరాలు పడుతూంది. సంవత్సరాల తరబడి పెట్టుకున్న అర్జీలు అలాగే ఉండిపోయిన ఉదాహరణ లనేకం ఉన్నాయి. అలాగే వీటికి కేటాయించిన స్వల్ప మొత్తాలు సహితం చాలాసందర్భాలలో వినియోగ పడడంలేదు.

వ్యవసాయ కార్మికుల పరిస్థితిని బాగుచేసేందుకు తీసుకోవలసిన చర్యలు :- పైన వ్యవసాయ కార్మికవర్గం యొక్క దుర్భరజీవిత పరిస్థితులు వివరించబడ్డాయి. వీరి యొక్క యీ నికృష్ట పరిస్థితులను మెరుగుపరచకుండా ఆర్థిక, సాంఘిక అసమానతలను పోగొడుతున్నామని చెప్పడంగానీ, వ్యవసాయోత్పత్తిని పెంచగలమనుకోవడం గాని ఉత్త గప్పాల పోగుగా కన్పడకమానదు. ఈ క్రింది చర్యలద్వారా వీరి పరిస్థితిని సత్వరమే మెరుగుపరచేందుకు ప్రభుత్వం కృషిచేయ వలసి యుంటుంది.

1. వ్యవసాయ కార్మికులు వెట్టిచేయడాన్ని నిషేధించి ఆ నిషేధాన్ని సక్రమంగా అమలుజరపాలి. 2. న్యాయమైన కనీస కూలీరేట్లను చట్టాలద్వారా నిర్ణయించి వాటిని ఖచ్చితంగా అమలుజరిపేటట్లు చూడాలి. 3. బంజర్లు, సాగుకు లాయకైన యితర భూములను వ్యవసాయకూలీ కుటుంబాలకు ఉచితంగా పంచిపెట్టాలి. 4. కమతాలకు గరిష్టపరిమితి విధించి అదనపు భూములను వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు పంచిపెట్టాలి. 5. గ్రామాలలో అనువైన చిన్నచిన్న వ్యవస

సాయ పరిశ్రమలను (Small scale agro-industries) నెలకొల్పి వ్యవసాయ కార్మికులకు పనిలేనిరోజులలో పనులు కల్పించాలి. 6. అభివృద్ధి కార్యక్రమాల పనులలో ప్రధానంగా వ్యవసాయ కార్మికులకు పనులు అప్పజెప్పాలి. 7. గృహావసతులు, విద్య, ఆరోగ్యవసతులు వగైరాలకు ప్రభుత్వం యింకా ఎక్కువ ధనాన్ని కేటాయించాలి. 8. భూస్వాములకు వ్యవసాయ కార్మికులు యివ్వవలసిన పాత అప్పులన్నింటిని శాసనాల ద్వారా రద్దుచేయాలి. ద్వితీయ ప్రణాళికలో రూ. 20 కోట్లయినా వీరికి అప్పుయిచ్చేందుకు ప్రభుత్వం కేటాయించి సహకారసంఘాల నిబంధనలను సవరించి వ్యక్తి హామీపైన వీరికి అప్పుయిచ్చే ఏర్పాట్లు చేయాలి.

# ఆహార సమస్య

ప్రధానంగా వ్యవసాయిక దేశమైన భారతదేశంలో, స్వాతంత్ర్యం లభించిన 11 సం|| ల పిమ్మటకూడా, ఆహార సమస్య విషమంగా ఉంటూన్నదంటె నిజంగా ఆశ్చర్యపడవలసిన విషయమే. ఇంతవరకు ఆహార స్వయంసమృద్ధిని సాధించుకోన లేకపోవుటకు ప్రధానకారణం మనం పాతపద్ధతిగా అవలంబిస్తున్న వ్యవసాయక విధానాలే.

పుష్టిహీనమైన ఆహారం:— అసలే మన దేశంలో సాధారణ ప్రజలయొక్క కొనుగోలుశక్తి చాలాతక్కువగా ఉన్నందువలన ఆహారపదార్థాల వాడకం చాలా తక్కువ. చాలా పుష్టిహీనమైన ఆహారాన్ని తీసుకుంటున్నారు. ఆరోగ్య నిపుణుల అంచనాప్రకారం ప్రతిమనిషికి దినానికి కనీసం 2000 కాలరీల (కాలరీ అనగా వేడిపరిమాణాన్ని తెలిపే కొలమానం) పుష్టినిచ్చే ఆహారం కావాలి. కాని భారతదేశంలో యీనాటి సగటు 1621 కాలరీలు మాత్రమే. (అమెరికాలో 3128 కాలరీలు, కెనడాలో 3062 కాలరీలు సగటున ప్రతి మనిషీ తీసుకుంటున్నాడు.) ఇంత తక్కువ పరిమాణంగల ఆహారం తీసుకుంటూండడంవలననే మనదేశంలో మరణాల సంఖ్య, ముఖ్యంగా శిశుమరణాల సంఖ్య చాలా ఎక్కువగా ఉన్నది. మన దేశంలో పుష్టినివ్వగల పాలు, వగైరాల వాడకం సగటున మనిషికి 5.5 ఔన్సులు మాత్రమే. అమెరికాలో పాలవాడకం సగటున 14.2, డెన్మార్కులో 15.8, స్విట్జర్లాండ్‌లో 22.2 ఔన్సులు ఉన్నది. కావున ప్రజలు ఆరోగ్య

సంతులుగా ఉండాలంటే యింకా ఎక్కువ మొత్తంలో పుష్టి కరమైన ఆహారాన్ని వాడవలసియుంటుంది.

ఆహార కొరత :- ఒకవేళ మన ప్రజలకొనుక్కొ- కొనుగోలుశక్తి పెరిగిందనుకున్నా పుష్టికరమైన ఆహారం చాలినంతగా మనదేశంలో ఉత్పత్తికావడంలేదు కూడాను. ఒకవైపున దేశజనాభా పెరుగుతూంది. ఆ పెరుగుదల కనుగుణ్యంగా మన ఆహారపదార్థాల ఉత్పత్తి పెరుగుటలేదు. ఉదాహరణకు 1901-'51 సంవత్సరముల మధ్య భారతదేశ జనాభా (పాకిస్తాన్ మినహాయించబడింది) 23 కోట్ల 81 లక్షల నుండి 36 కోట్ల 20 లక్షలకు, అంటే దాదాపు 52% లేక సగటున సంవత్సరానికి 1¼% పెరిగింది. కాని మన ఆహార పదార్థాల ఉత్పత్తిమాత్రం యీ కాలంలో అలాగే ఉండిపోయింది. ఫలితంగా ఆహారకొరత రానురాను ఎక్కువవుతూనే వచ్చింది. 1936 లో బర్మా విడిపోవుటతో 13 లక్షల టన్నులు, 1947 లో పాకిస్తాన్ విడిపోవుటతో మరొక 7.7 లక్షల టన్నులు కొరత ఎక్కువయింది. స్వతంత్ర దశలో స్వాతంత్ర్యానంతరం కూడా ఆహారపదార్థాల ఉత్పత్తి స్తంభించి అలాగే యుండుటవలన కొరత కొరతగానే ఉంటూ వస్తూంది. ఉదాహరణకు 1947-'52 వరకుగల 5 సంవత్సరాలలోను సంవత్సరానికి సగటున 30 లక్షల టన్నుల ఆహార పదార్థాలను దిగుమతి చేసుకోవలసివచ్చింది. మనిషికి రోజుకు సగటున 13.7 ఔన్సుల లెక్కచొప్పున అవసరమైన ఆహారం సప్లయిచేసే నిమిత్తమే యింత దిగుమతి అవసరమయిందని గుర్తుంచుకోవాలి. అలాగే 1957 నాటికి మన దేశ జనాభా

39 కోట్ల 24 లక్షలకు పెరిగింది. ఆ సంవత్సరం మన దేశంలో ఆహారపదార్థాల ఉత్పత్తి 6 కోట్ల 86 లక్షల 90 వేల టన్నులున్నది. మనిషికి సగటున 18 ఔన్సుల చొప్పున ఆహార పదార్థాలు సప్లయిచేయాలంటే అదనంగా 37 లక్షల 20 వేల టన్నుల దిగుమతులు అవసరమయ్యాయి. ఆరోగ్యనిపుణులు చెప్పినట్లు మనిషికి సగటున రోజుకు 25 ఔన్సుల చొప్పున సప్లయిచేయాలంటే యింకా ఎక్కువ ఆహారపదార్థాలు అవసరమవుతాయి.

అంతేగాదు పారిశ్రామికాభివృద్ధికి కృషి జరుగుతున్నపుడు ఆహారపదార్థాల ఉత్పత్తిలో పరిమాణాత్మకమైన, గుణాత్మకమైన (Quantitative & Qualitative) అభివృద్ధి తప్పనిసరి అవుతుంది. అధికాధికంగా ఆహారపదార్థాలు మార్కెట్లోనికి రావలసి యుంటుంది.

కావున మన జనాభా పెరుగుదల రేటునుబట్టి చూచినా, మన ప్రజల అవసరాలను చూచినా, అభివృద్ధియౌతున్న ఆర్థికవ్యవస్థ దృష్ట్యా చూచినా, ఆహారపదార్థాల ఉత్పత్తిని తక్షణమే కనీసం రెండురెట్లైనా పెంచడ మవసరమవుతుంది.

కాని యీనాడు మన ఆహార పదార్థాల ఉత్పత్తి సనేమీ పెరగడంలేదు. ఎక్కడున్నావే గొంగళీ అంటే ఉన్నచోటే నన్నట్లుగా ఉంది. వ్యవసాయిక వ్యవస్థలో మౌలికమైన మార్పులు తీసుకురాకుండా, వ్యవసాయోత్పత్తి శక్తుల పెరుగుదలకు ఆటంకంగా ఉన్న భూసంబంధాలను రద్దుచేయకుండా, పాతవ్యవస్థ మూలాన్ని అలాగే ఉంచి ఆహార

పదార్థాల ఉత్పత్తిని పెంచేందుకు ప్రభుత్వం కోట్లకొలది రూపాయల ప్రజాద్రవ్యాన్ని ఖర్చుపెట్టి చేస్తున్న కృషి బూడిదలో పోసిన పన్నీరులా పరిణమిస్తూంది. కొరతను పూడ్చుకొనేందుకు ఆహార దిగుమతుల నిమిత్తం ప్రతి సంవత్సరమూ కోట్లాది రూపాయల విలువగల విదేశీ ద్రవ్య మారకం హరించుకు పోతూంది. ప్రణాళికే సంక్షోభంలో పడింది.

అధికాహారోత్పత్తికి ప్రభుత్వ కృషి :- మన దేశంలో 1939 నాటికే ఆహార సంక్షోభం యేర్పడింది. కాని ఆనాటి బ్రిటిష్ పాలకులు సంక్షోభాన్ని పరిష్కరించేందుకు ఎట్టిచర్యలు తీసుకోకుండ పూర్తిగా అశ్రద్ధచేశారు. చివరకు 1943 లో బెంగాల్ రాష్ట్రంలో కనీవినీ ఎరుగనంతటి భయంకరమైన కరువు వచ్చింది. డాదాపు 35 లక్షలమంది ప్రజానీకాన్ని కరువురాకాసి తన పొట్టబెట్టుకుంది. దానితో బ్రిటిష్ పరిపాలకులు తప్పనిసరియై ఒక కేంద్ర ఆహారశాఖను నెలకొల్పవలసి వచ్చింది. ఆనాటినుండి మనదేశంలో ఆహారోత్పత్తి పెరుగుదలకు అనేకరకాల ఉద్యమాలు ప్రారంభించబడ్డాయి. ఆనాడు బ్రిటిష్ పాలకులచే 1943 లో నియమించబడిన ఆహార పదార్థాల విధానకమిటీ (దీనినే కృష్ణమాచారి కమిటీ అంటారు.) ఆహారసమస్యా పరిష్కారానికి అధికోత్పత్తి ఉద్యమాన్ని ప్రారంభించాలని, తక్షణపరిష్కారానికి ఆహార కంట్రోళ్లు నమలుజరపాలని సూచించింది.

అధికాహారోత్పత్తి ఉద్యమం :- ఈ ఉద్యమాన్ని బ్రిటిష్ పాలకులు 1943 నుండి 1947 ఆఖరువరకు నడిపారు.

బంజర్లను, పడావులను సాగులోనికి తెచ్చి సాగుభూమిని పెంచాలని, మంచి విత్తనాలు, ఎరువులు రైతాంగానికి సరఫరా చేయాలని, నీటివసతుల నభివృద్ధి చేయాలని సంకల్పించబడింది. ఇందునిమిత్తం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అప్పులు, సబ్సిడీల రూపంలో 16 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టారు. కాని వ్యవసాయపు పునర్వ్యవస్థీకరణ లేనందున యీ ప్రయత్నాలు తగినంతగా ఫలించలేదు. ఆహారోత్పత్తి చెప్పుకో తగినంతగా పెరగలేదు.

ఆహార కంట్రోళ్లు :- 1943 నుండి 1947 ఆఖరువరకు ఆహార కంట్రోలు, ఆహారపదార్థాల ధరల కంట్రోలు, ఆహారపదార్థాల సరఫరా కంట్రోలు అమలు జరపబడ్డాయి. గ్రామసీమలలో ఆహారపదార్థాలను ప్రొక్యూర్ చేయడం ద్వారాను, విదేశాలనుండి దిగుమతి చేయడం ద్వారాను లభ్యమైన ఆహారపదార్థాలను రేషనింగు ద్వారా సరఫరా చేయుటకు కృషిజరిగింది. 1947 ఆగష్టునాటికి 15 కోట్ల 40 లక్షలమంది ప్రజలకు రేషనింగుద్వారా ఆహారపదార్థాలు సరఫరా చేయబడుతూండేవి. కాని క్రమంగా బ్లాక్‌మార్కెట్, లాభాపేక్ష, ధరల పెరుగుదలవలన ప్రజలలో రేషనింగుపై అసంతృప్తి ప్రబలిపోయింది.

1947 డిశెంబర్‌లో స్వాతంత్ర్యం వచ్చినకొద్ది కాలానికి భారతప్రభుత్వం కంట్రోళ్లను సడలించేసరికి ధరలు మరింత పెరిగిపోయాయి. తిరిగి కంట్రోళ్లు విధింపబడ్డాయి. 1952 లో ఆహారపరిస్థితి కొంత మెరుగుకావడంతో క్రమంగా కంట్రోళ్ల

విధానాన్ని సడలిస్తూ తుదకు 1954 జూలై 10 వ తేదీన దానికి పూర్తిగా స్వస్తి చెప్పబడింది.

ఆహార స్వయంసమృద్ధి కృషి :- భారత ప్రభుత్వం 1947 లో రెండవ ఆహార ధాన్యాల విధానకమిటీ (దీనినే ఠాకుర్ దాస్ కమిటీ అంటారు) నివేదిక ననుసరించి, ఉన్న భూమిలోనే ఎక్కువ పంట పండించుట ద్వారాను (intensive cultivation), రెండుపంటలను ప్రోత్సహించుట ద్వారాను అధికోత్పత్తిని సాధించ తలపెట్టింది. అలాగే ఆనాటి ఆహార మంత్రిగానున్న శ్రీ కె. యం. మున్షీగారి ఆధ్వర్యాన నీటి వనరులను విస్తరింపజేయుటకు, పంటలను చీడపురుగులు వగైరాలనుండి కాపాడేందుకు, పంటల పోటీలు జరిపేందుకు పథకం తయారుచేసి తద్వారా ఆహార స్వయంసమృద్ధిని సాధించ పూనుకున్నది. ఏ సంవత్సరానికా సంవత్సరం వివిధ రాష్ట్రాలలో అధికోత్పత్తి లక్ష్యాలు నిర్ణయించబడ్డాయి. కాని ఆచరణలో యీ కృషికూడా పెద్దగా ఫలించలేదు. 1949 - '51 సంవత్సరాలలో 72 లక్షల టన్నుల అదనపు ఆహారధాన్యాలను పండించాలనే లక్ష్యానికి 14 లక్షల టన్నులను మాత్రమే పండించుట జరిగింది.

పంచవర్ష ప్రణాళికలు - ఆహారోత్పత్తి :- మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయ పునర్వ్యవస్థీకరణ ద్వారా వ్యవసాయాభివృద్ధిని, అధికోత్పత్తిని సాధించాలని తలపెట్టబడింది. ఈ ఉద్దేశంతో వ్యవసాయానికి, సమాజవికాస కేంద్రాలకు కలిపి రూ 357 కోట్లు కేటాయించబడ్డాయి. కొన్ని భూసంస్కరణలు అమలు జరుపబడ్డాయి. కొన్ని మధ్య

చిన్నరకపు యిరిగేషన్ ప్రాజెక్టులు నిర్మించబడ్డాయి. నూతులు, గొట్టపు బావులు త్రవ్వించబడ్డాయి. తద్వారా కొంత అభివృద్ధి సాధించబడింది. కాని ఉత్సాహంతో కష్ట పడి పండించగలిగినవారికి భూమి పంచకపోవుటవలన అభివృద్ధి అంతగా జరగ లేదు.

అయితే మొదటి ప్రణాళికా కాలంలో పెట్టుకున్న అధికాహారోత్పత్తి లక్ష్యం దాదాపు నెరవేరింది. కాని దీనికి ప్రధానకారణం వర్షాలు సక్రమంగా కురిసి వాతావరణం సజావుగా ఉండడమే. 1953 - '54 లో యీ అనుకూల పరిస్థితులవలన బాగా పండిన పంట తిరిగి క్రమంగా నిలకడ లేకుండా తగ్గుతూ హెచ్చుతూ వస్తూంది. ఈ క్రింది టేబిల్‌ను పరిశీలించగలరు.

| సంవత్సరం. | | ఆహార పదార్థాల ఉత్పత్తి. (లక్షల టన్నులలో) |
|---|---|---|
| 1953 - 54 | ... | 688.87 |
| 1954 - 55 | ... | 671.10 |
| 1955 - 56 | ... | 652.90 |
| 1956 - 57 | ... | 686.90 |

(ఆహారధాన్యాల ఎంక్వయిరీ కమిటీ రిపోర్టునుండి)

పై వివరాలు పరిశీలించినపుడు 1953-'55 ల మధ్య రెండు సంవత్సరాలలోను జరిగిన ఉత్పత్తికన్న 1955-'57 ల మధ్య రెండు సంవత్సరాలలో జరిగిన ఉత్పత్తి 20 లక్షల టన్నులు తగ్గిపోయిందని స్పష్టమవుతుంది.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో అదనంగా కోటి టన్నుల ఆహారధాన్యాలు పండించాలనే లక్ష్యం నిర్ణయించ బడింది. కాని ఆ లక్ష్యం కాగితంమీదే ఉండిపోయేటట్లు గోచరిస్తూంది. ప్రభుత్వ లెక్కలప్రకారం 1956 లో జరిగిన ఆహారధాన్యాల ఉత్పత్తికన్న 1957 లో ఉత్పత్తి 67 లక్షల టన్నులు తగ్గిపోయినట్లు తెలుస్తూంది. (686.90 లక్షల టన్నుల నుండి 620 లక్షల టన్నులకు పడిపోయింది.)

పైన వివరించినట్లు ఆహారధాన్యాల ఉత్పత్తి పెరగక పోవడం ఫలితంగా ప్రతి సంవత్సరమూ మనదేశంలో ఆహార కొరతను పూడ్చుకునేందుకు విదేశాలనుండి కోట్లకొలది రూపాయల విలువగల ఆహారధాన్యాలను దిగుమతి చేసుకో వలసి వస్తూంది.

భారతదేశంలో ఆహారధాన్యాల దిగుమతి భారం.

| | | |
|---|---|---|
| 1948 లో | ... | 28 లక్షల టన్నులు |
| 1949 ,, | ... | 37 ,, ,, |
| 1951 ,, | ... | 47 ,, ,, |
| 1955 ,, | ... | 7 ,, ,, |
| 1956 ,, | ... | 14 ,, ,, |
| 1957 ,, | ... | 36 ,, ,, |
| 1958 ,, | ... | 35 ,, ,, |

స్వాతంత్ర్యానంతరం 11 సంవత్సరాలలోనూ రు. 1400 కోట్లు విదేశాలకు ఆహారధాన్యాల దిగుమతులకై తరలి పోయింది.

ఎంతడబ్బు ఖర్చుపెట్టినా ఆహారోత్పత్తిని అధిక చేయుటలో ప్రభుత్వం విఫలమవుతూనే ఉండుటకు ప్రధా

కారణమేమిటి ? మన పొరుగుననే ఉన్న చైనాదేశం మనకన్న రెండుసంవత్సరాల వెనుక ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పు కున్నప్పటికి యీనాడు ఆహారధాన్యాల ఉత్పత్తిని సర్వ సాధారణంగా రెండురెట్లు పెంచుటకు, కొన్ని ప్రత్యేక ప్రాంతాలలో ప్రపంచాన్ని దిగ్భ్రమ గొల్పేటట్లు ఉత్పత్తిని పెంచుటకు కారణమేమిటి ?

చైనాలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ప్రజా ప్రభుత్వ మేర్పడిన తరువాత మూడేండ్లలో పూర్తిగా భూస్వామ్యవ్యవస్థ రద్దుచేయబడింది. దాదాపు 11 కోట్ల 67 లక్షల ఎకరాలభూమి వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు పంచిపెట్టబడింది. మొత్తం 30 కోట్ల రైతాంగానికి ఆర్థిక లాభం చేకూర్చబడింది పూర్వం భూస్వాములకు రైతులు కౌలుక్రింద చెల్లిస్తున్న 3 కోట్ల టన్నుల ధాన్యానికి రైతులే అధిపతులయ్యారు. ఈవిధంగా కౌలుభారంనుండి, భూస్వాముల బానిసత్వంనుండి విముక్తి చేయబడి తమభూమికి, దానిలో పండిన పంటలకు తామే అధినేతలైన నవచైనా రైతాంగంలో అపూర్వమైన ఉత్సాహం వెల్లివిరిసింది. ఎనలేని పట్టుదలతో వ్యవసాయకోత్పత్తిని పెంచేందుకు కృషి ప్రారంభించారు.

అంతేగాదు విముక్తిచెందిన రైతాంగానికి చైనా ప్రజా ప్రభుత్వం అనేకవిధాల సహాయం చేస్తూవస్తూంది. వ్యవ సాయక పశువులను, పరికరాలను, విత్తనాలు, ఎరువులు వగైరాలను కొనుక్కునేందుకు విరివిగా అప్పులు మంజూరు చేయడం, ప్రభుత్వం వీరికి నవీన వ్యవసాయపరికరాలను వినియోగించుకునేందుకు సమకూర్చిపెట్టడం, వ్య వ సా య

సరుకులకు సరసమైన ధరలను నిర్ణయించి స్థిరమైన మార్కెట్లను చూపించడం, పన్నుభారాన్ని తగ్గించడం, మిడతలదండు, చీడపురుగులు, అతివృష్టి, అనావృష్టి, వరదలు మొదలైనవాటినుండి రక్షించేందుకు తగినచర్యలు తీసుకోవడం, నీటివనరులను అభివృద్ధిచేయడం, వ్యవసాయంలో శాస్త్రీయ, సాంకేతిక పద్ధతులలో రైతాంగానికి తరిఫీదు యిచ్చి బహుళంగా సహాయపడడం వగైరా చర్యలద్వారా అధికోత్పత్తిని సాగించేందుకు రైతాంగానికి తోడ్పడింది.

దీనితోపాటు వ్యవసాయిక వ్యవస్థలో క్రమంగా వ్యక్తిగత ఉత్పత్తి విధానంనుండి సహకారోత్పత్తి విధానానికి రైతాంగాన్ని నడిపించడం జరిగింది. మొదట పరస్పర సహాయక దళాలు, పిమ్మట వ్యవసాయకోత్పత్తిదారుల సహకార సంఘాలు, తరువాత సహకార వ్యవసాయక్షేత్రాలు ఏర్పరచబడ్డాయి. ఈనాడు ప్రజాకమ్యూన్లనే సోషలిష్టు నిర్మాణరూపంలో ఉన్నతస్థాయిలోనికి గ్రామీణ ప్రజానీకం సమీకరించబడుతూంది. ఈ విధంగా చిన్నఎత్తు ఉత్పత్తిస్థానే వ్యవసాయంలో భారీయెత్తున సోషలిష్టు ఉత్పత్తి ప్రవేశపెట్టబడింది.

పై మార్పుల ఫలితంగా వ్యవసాయంలో ఉత్పత్తిశక్తుల సంకెళ్లుతొలగి అపూర్వంగా విజృంభించాయి. పంటలు అనతి కాలంలోనే రెట్టింపుకు పైగా పెరిగాయి. 1952 లో 1430 లక్షల టన్నులు మాత్రమే ఉన్న ఆహారధాన్యాల ఉత్పత్తి 1957 లో 1850 లక్షల టన్నులకు, 1958 లో 3500 లక్షల టన్నులకు పెరిగింది. 1959 లో భారతదేశంలో ఆహార

ధాన్యాల ఉత్పత్తి సగటు మనిషికి 370 పౌనులైతే, చైనాలో యిదే సంవత్సరంలో సగటు ఉత్పత్తి 1100 పౌనులున్నది.

మనదేశంలో వ్యవసాయంలో యిలాంటి కీలకమైన మార్పులేవీ జరగలేదు. అందుచేత వ్యవసాయోత్పత్తి శక్తుల సంకెళ్లు బద్దలుకాలేదు. దోపిడీవ్యవస్థ మరొకరూపంలో కొనసాగుతూంది.

ఆహారోత్పత్తిని పెంచాలంటె యీ క్రిందిచర్యలు తీసుకోవలసియుంటుంది. (1) దున్నేవానికే భూమి లభించే టట్లు వ్యవసాయ సంస్కరణలను ఖచ్చితంగా అమలుజరపాలి. (2) సాగుకు లాయకైన బంజర్లు వగైరాలను వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు ఉచితంగా పంచి వాటిని సాగు లోనికి తెచ్చేందుకు తగుసహాయం చేయాలి. (3) మేజర్ యిరిగేషన్ వనరులతోపాటు సత్వరఫలితాల నిచ్చేగల మైనర్ యిరిగేషన్ వనరులను అభివృద్ధి చేయాలి. (4) రైతాంగానికి పరపతిసౌకర్యాలు విరివిగా కలిగించి వారి ఋణభారాన్ని తగ్గించేందుకు చర్యలు తీసుకోవాలి. అదే విధంగా వారి సరుకులకు స్థిరమైన మార్కెట్లను చూపించి సరసమైన ధరలను గారంటీచేయాలి. (5) ప్రస్తుతమున్న అన్యాయపు భూమిశిస్తు విధానాన్ని రద్దుచేసి గిట్టుబాటుగాని కమతాలపై పన్ను లేకుండాచేసి మిగిలిన వ్యవసాయాదాయా లపై వృద్ధిక్రమానుసారంగా పన్నువిధించాలి.

ప్రస్తుత ఆహార సంక్షోభం :- పైన వివరించినట్లు ఆహార స్వయంసమృద్ధిని సాధించుటలో విఫలంగావడమే గాక

కాంగ్రెసు ప్రభుత్వాలు ఆహారసమస్యను పరిష్కరించుటలో కూడా విఫలమవుతున్నాయి. ఆహారసంక్షోభం రానురాను తీవ్రతరమవుతూంది. ఈనాడు దేశంలో అనేకప్రాంతాలలో తీవ్ర ఆహారకొరత ఏర్పడింది. పశ్చిమబెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్ వగైరా రాష్ట్రాలలో ఆహార సత్యాగ్రహాలు జరగడం చూస్తూనే ఉన్నాము. ఆహార కొరతతో పాటు రెండవనైపున ఆహారపదార్థాల ధరలు ప్రజలకు అందుబాటులో లేకుండా పెరిగిపోవుట ఫలితంగా మిగులు ప్రాంతాలలో కూడా ప్రజలు యిబ్బందిపడుతున్నారు.

ప్రభుత్వ విఫలత :- 1956 కన్న 1957 లో మన దేశంలో ఆహార పదార్థాల ఉత్పత్తి 67 లక్షల టన్నులు తగ్గిపోయింది. కాని మన ప్రభుత్వం విదేశాలనుండి 40 లక్షల టన్నులను మాత్రమే దిగుమతి చేసుకునేందుకు ఏర్పాట్లు చేసింది. అంతే గాదు. దేశంలో పండిన పంటనైనా సక్రమంగా ప్రజల కందించే బాధ్యతను ప్రభుత్వం సరిగ్గా నిర్వహించలేకపోతూంది. ప్రజాతంత్ర పార్టీలు ఆందోళనచేస్తున్నప్పటికి ప్రభుత్వం పంటల తరుణంలో స్వయంగా ధాన్యం కొని బఫర్ స్టాక్‌లు నిర్మించుటకు నిరాకరిస్తూ వచ్చింది. వ్యాపారస్తులకు, చట్టా వ్యాపారులకు బాంకులలో విరివిగా ఋణాలిచ్చి (ఈ మధ్యనే కొన్ని పరిమితులు విధించబడినప్పటికీ) ధాన్యాదులను కొని నిల్వచేసి వారి చిత్తం వచ్చినట్లు ధరలను పెంచేందుకు అవకాశాన్ని యిస్తూ వచ్చింది. అదేవిధంగా యీ వ్యాపాయల నుండి, ధాన్యాన్ని దాచేసిన భూస్వాములనుండి ధాన్యపు నిల్వలను స్వాధీనం చేసుకునేందుకు పూనుకోలేదు. ధాన్యపు

దొంగ రవాణాను, దొంగ మార్కెట్‌ను అరికట్టేందుకు ఎట్టి చర్యలు తీసుకోలేదు. పరిస్థితులు విషమిస్తున్నా, ధరలు పెరిగి సాధారణ ప్రజలు కొనుక్కోలేక యిబ్బందిపడుతున్నా, చౌక డిపోలను తెరచి సరసమైన ధరలకు ప్రజలకు ధాన్యాన్నందించేందుకు కృషి చేయలేదు. పైగా ఆహార సమస్యా పరిష్కారంలో యితర పార్టీల, ప్రజాసంస్థల సహకారాన్ని తీసుకో నిరాకరించింది. తమంతటం తాము నియమించిన ఆహార ధాన్యాల విచారణ కమిటీ రిపోర్టులోని సూచనలను (అశోక మెహతా కమిటీ రిపోర్టులోని సూచనలను) కూడా అమలు జరుప బూనుకోలేదు.

అసలే ఆహార ధాన్యాల ఉత్పత్తి ఎదుగు బొదుగులు లేకుండ ఉన్న పరిస్థితులలో కేంద్ర, రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు అవలంబిస్తున్న పై విధానాలు ప్రస్తుత తీవ్ర ఆహార సంక్షోభానికి దారితీశాయి.

సంక్షోభ పరిష్కార సూచనలు :- సంక్షోభాన్ని పరిష్కరించాలంటే ప్రభుత్వం యీ క్రింది చర్యలు తీసుకున్ననాడే సాధ్యమవుతుంది.

1. ఇటీవల కేంద్ర ప్రభుత్వం ధాన్యం వ్యాపారాన్ని ప్రభుత్వమే నిర్ణయించేందుకు తలపెట్టిన స్కీమును అన్ని రాష్ట్ర ప్రభుత్వాల చేత ఖచ్చితంగా అమలుజరిపించాలి. 2. తరుగు ప్రాంతా లన్నింటిలోను 500 కుటుంబాల కొకటి చొప్పున చౌకడిపోలను నెలకొల్పి గుర్తుకార్డులిచ్చి ధాన్యాన్ని ప్రజలకు సరఫరా చేయాలి. 3. అదేవిధంగా తరుగుప్రాం

తాలలోని పేదప్రజలకు అభివృద్ధి కార్యక్రమాలు, రిలీఫ్ పనులు వగైరాల ద్వారా పనులు కల్పించి వారి కొనుగోలు శక్తిని పెంచవలసి యుంటుంది. 4. పైనుండి క్రిందివరకు అన్ని స్థాయీలలోను వివిధపార్టీలు, ప్రజాసంస్థలతో కూడిన ఆహార కమిటీల నేర్పరచి వాటికి చౌకడిపోలను, రిలీఫ్ కార్యక్రమాలను అజమాయిషీ చేసే హక్కు యివ్వాలి. 5. తీవ్ర ఆహార సంక్షోభానికి గురియైన ప్రాంతాలలో పన్నుల, శిస్తుల తగ్గింపు అమలు జరపాలి. 6. వ్యవసాయదారులకు విరివిగా డబ్బు రూపేణా, ధాన్యరూపేణా అప్పులు మంజూరు చేయాలి. 7. అటు రైతులకు, యిటు వాడకందారులకు అనుకూలంగా ఉండేటట్లు ఆహార ధాన్యాలకు కనీస, గరిష్ట ధరలను నిర్ణయించాలి. గరిష్టధర కనీసధరకు 15 శాతం కన్న మించకుండా చూడాలి. 8. వ్యాపారులకు, చట్టా వ్యాపారస్థులకు ఆహార ధాన్యాల నిల్వలపైన బాంకులు రుణాలు యివ్వకుండా తీవ్రమైన పరిమితులు విధించాలి.

ప్రభుత్వం తీసుకోవలసిన యీ చర్యలతో పాటు, మన రైతాంగం, వ్యవసాయ కార్మికులు సమగ్రమైన వ్యవసాయ సంస్కరణల అమలుకు పోరాడుతూనే ఆహారోత్పత్తిని అధికం చేసి మన ప్రజలను పోషించుకోవలసిన దేశభక్తియుత కర్తవ్య నిర్వహణకు నడుంకట్టవలసి యుంటుంది.

# ముగింపు

ఇంతవరకు స్వాతంత్ర్యానంతరం వ్యవసాయ రంగంలో జరుగుతున్న కృషిని, వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలో వస్తున్న మార్పులను వివరించడం జరిగింది. స్వాతంత్ర్యం లభించి పదకొండు సంవత్సరాలయింది. వ్యవసాయ సంస్కరణలపేరుతో ప్రభుత్వం అనేక చట్టాలను తెచ్చింది. కాని వ్యవసాయ వ్యవస్థా పునర్నిర్మాణంలో ప్రధాన, కీలక పాత్రను నిర్వహించగల — కష్టపడి దున్ని పండించేవానికే భూమి అనే ఆశయం యీనాటికీ నెరవేరలేదని స్పష్టమవుతుంది. అదేవిధంగా వ్యవసాయోత్పత్తిని పెంచే కార్యక్రమం కుంటుపడుతూ ఉందని, ఆహారసమస్య పరిష్కారం కానేలేదని తేలుతుంది. రైతులపైన అధికాధికంగా శిస్తుభారం, పన్నులభారం, ఋణభారం పెరుగుతున్నాయేగాని తరగడం లేదనికూడా విదితమవుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే వ్యవసాయ ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి, విజృంభణకు ఆటంకంగా ఉన్న సంకెళ్ళు ఇంతవరకు బద్దలు కాలేదు.

ఈ పరిస్థితికి ప్రధానకారణ మేమిటి? బూర్జువా వర్గ నాయకత్వాన గల కేంద్రప్రభుత్వము, భూస్వాముల ప్రాబల్యంలోగల రాష్ట్ర ప్రభుత్వాలయొక్క వర్గస్వభావము, అవి అవలంబిస్తున్న తదనుగుణ్యమైన విధానాలే ఇందుకు కారణం.

ప్రభుత్వం తీసుకొస్తున్న వ్యవసాయ సంస్కరణాల యొక్క ధ్యేయం వ్యవసాయంలో పెట్టుబడిదారీ అభివృద్ధికి

ఆటంకంగానున్న ఫ్యూడల్ శక్తులను సంస్కరించి అదుపులో బెట్టి (curb) పెట్టుబడిదారీ ప్రయోజనాలను పెంపొందించి స్థిర పరచుకోవడమేనని స్పష్టమవుతుంది. గ్రామీణ వ్యవస్థలో ఫ్యూడల్ సంబంధాలస్థానే పెట్టుబడిదారీ సంబంధాలను నెల కొల్పి, ఫ్యూడల్ దోపిడీ స్థానే పెట్టుబడిదారీ దోపిడీని కొన సాగించడమే వాటియొక్క పరమావధిగా గోచరిస్తుంది.

ప్రభుత్వంయొక్క చర్యలన్నీ ఇందుకు తార్కాణం. వ్యవసాయక సరుకులపైన క్రమంగా దేశీయ విదేశీ గుత్త వ్యాపారుల ఆధిపత్యం ఎక్కువవుతూంది. వారి చిత్తంవచ్చి నట్లు ధరలను నిర్ణయించి రైతాంగాన్ని దోపిడిచేస్తున్నారు. ఒకవైపున వ్యవసాయంలో ధన ప్రాబల్యం పెరిగిపోతూంటే, రెండవవైపున రైతాంగానికి అవసరమైన రుణాలు సహకార సంస్థలనుండి గాని, ప్రభుత్వంనుండి గాని లభించకపోవుటవలన రానురాను వడ్డీవ్యాపారస్థుల చేతులలో యిరుక్కుపోతున్నారు. అదేవిధంగా కాంగ్రెసు ప్రభుత్వాలు ప్రవేశపెడుతున్న వ్యవ సాయ సంస్కరణాలు పాత జమీందారులను, జాగీర్దారులను పెట్టుబడిదారీ భూస్వాములుగా తయారుచేసుకునేందుకు, ధనిక రైతువర్గాన్ని బలపరచి వారిలో పాలకవర్గంయొక్క వర్గ పునాదిని స్థిరపరచుకునేందుకు మాత్రమే ఉపయోగిస్తున్నాయి. ఈసంస్థలద్వారా పాలకవర్గం పరిశ్రమలకవసరమైన ముడిపదార్థాల ఉత్పత్తిని పెంచుకోవచ్చునని, గ్రామసీమల్లో తమ రాజకీయ పునాదిని విస్తరింపజేసుకోవచ్చునని ఆశిస్తూంది.

ఈ నాడు భారతదేశంలో క్రమంగా పెరుగుతున్న వ్యవసాయిక సంక్షోభం పాలకవర్గ మవలంభిస్తున్న ప్రజాతంత్ర వ్యతిరేక వ్యవసాయిక విధానాల పర్యవసానమే. ఈ విధానాల ఫలితంగా ఫ్యూడలిజం పూర్తిగా నిర్మూలం కాలేదు. 100 కి 75 మందికి పైగా రైతాంగం చాలీచాలని భూవసతిని కలిగి యున్నారు. ఉత్పత్తిదారులు శిస్తులు, పన్నులు, వడ్డీలభారంతో క్రుంగిపోతున్నారు. కోట్లాది గ్రామీణప్రజలు నిరుద్యోగులుగా ఉండి ఉత్పత్తిలో భాగస్వాములు కాలేకపోతున్నారు.

ఈ స్థితిలోనుండి మన వ్యవసాయం బయటపడాలంటె మన వ్యవసాయికోత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంకంగా ఉన్న సంకెళ్లను బద్దలు చేయవలసియుంటుంది. వ్యవసాయిక వ్యవస్థలో మౌళికమైన మార్పులు చేయవలసియుంటుంది. కాని పైనచెప్పిన ప్రభుత్వవిధానాల ద్వారానూ, పెట్టుబడిదారీ అభివృద్ధి పథం ద్వారానూ యీ మార్పులు వస్తాయనుకోవడం భ్రమ. కావున ప్రభుత్వం యొక్క యీ విధానాలను ఓడించి కీలకమైన వ్యవసాయ సంస్కరణల నమలు జరిపించడ మవసరం.

ఈ సందర్భంలో కమ్యూనిష్టుపార్టీ నాయకత్వాన ఏర్పడిన కేరళరాష్ట్రప్రభుత్వం వ్యవసాయ సంస్కరణలను ఏవిధంగా అమలుజరుపుతూందో జ్ఞప్తికి తేవడం అప్రస్తుతం గాదనుకుంటాను.

భారత రాజ్యాంగచట్టము పరిపాలనావ్యవస్థలో ప్రజాస్వామ్య వ్యతిరేక వైఖరులు, సూత్రాలు వగైరాల పరిమితు

లనేకం ఉన్నప్పటికీ కేరళ ప్రభుత్వం సాధ్యమైనంత మేరకు చిత్తశుద్ధితో వ్యవసాయోత్పత్తి శక్తుల సంకెళ్లను తొలగించుటకు కృషి చేస్తూంది.

కేరళ ప్రజాప్రభుత్వం అధికారం స్వీకరించిన ఒక్క వారంరోజుల లోపలనే అన్నిరకాల బేదఖళ్లను నిషేధిస్తూ ఆర్డినెన్సును ప్రకటించింది. తరువాత దానిని చట్టంగా చేసింది. దీనివలన లక్షలాది కౌలుదారులకు, భూస్వాముల భూముల్లో గుడిసెలు వేసుకుని జీవించే వ్యవసాయ కార్మికులకు రక్షణ గ్యారంటీ చేయబడింది.

అదేవిధంగా తిరువాన్కూరు మాజీ రాజకుటుంబానికి చెందిన 15 వేల ఎకరాల శ్రీపదం భూములకు నష్టపరిహారం చెల్లించి సాగుచేస్తున్న రైతులకు పట్టాలివ్వబడ్డాయి. మాజీ తిరువాన్కూర్ మహారాజుకు చెందిన 19 వేల ఎకరాల కుండుకృషి భూములకు, త్రివేండ్రంలోని అనంతపద్మనాభస్వామి దేవాలయానికి చెందిన పాండారవాక భూములకు కొంత నష్టపరిహారం యిచ్చి ఆ భూములలో ఉన్న కౌలుదారులకు పట్టాహక్కులు యిచ్చేందుకు బిల్లులు ప్రకటించబడ్డాయి. జన్మికరం రద్దు బిల్లుద్వారా భూస్వాములకు మొత్తంగా కొంత పరిహారం యిచ్చి వాటిలో మక్తాకుచేస్తున్న దాదాపు 1,10,000 మందికి పైగానున్న కౌలుదారులకు పూర్తిహక్కులు కలిగించ సంకల్పించబడింది. 7½ లక్షల ఎకరాల ప్రభుత్వ బంజర్లను గతసంవత్సరం ఏప్రిల్ 1 వ తేదీనుండి వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు పంచిపెట్టడం ప్రారంభమయింది.

మలబార్ ప్రాంతంలో అడవులను, అటవీ సంపదను రక్షించేందుకుగాను ప్రయివేట్ అడవుల మేనేజ్‌మెంటు స్వాధీన చట్టాన్ని తీసుకువచ్చారు.

రైతుల రుణభారాన్ని తగ్గించేందుకు గాను ఒక చట్టం చేయబడింది. దీని ప్రకారం రైతు తన రుణాన్ని 17 అర్థ సంవత్సర వాయిదాలలో తీర్చుకోవచ్చు. అంతేగాకుండా 1940 సంవత్సరానికి పూర్వం చేసిన అప్పుల్ని కొంత పరిమితికి తగ్గించారు. 1957 జనవరి 1వ తేదీ తర్వాత సివిల్ కోర్టులు రాబట్టుకునేందుకు వేలం వేసిన స్థిరాస్తుల విషయంలో కూడా రైతు కోరితే ఈ చట్టంవలన లాభం పొందవచ్చును. తనఖా బాకీలైతే సగం ఇస్తే మిగతాది కొన్ని వాయిదాలపై చెల్లించే పద్ధతిని తనఖాలు పెట్టిన రైతులు తమ భూములను విడిపించుకోవచ్చు.

కేరళ ప్రభుత్వం భూమిశిస్తు విధానంలో కూడా కొన్ని ప్రాథమికమైన సంస్కరణలు తీసుకువచ్చింది. మలబారు ప్రాంతంలో సెంటుకు 8 నయాపైసలుగా ఉండే భూమిశిస్తును 2 నయాపైసలకు తగ్గించింది. భూమిశిస్తుపై సర్‌చార్జీని రద్దు చేసింది. కొత్తగా నిర్మించిన ప్రాజెక్టుల క్రింద కొత్త, పాత సాగుభూములపై అభివృద్ధిపన్ను వసూలు చేయడం (పాతచట్టం ఉన్నప్పటికి) మానివేసింది. రైతాంగం నుండి భూమిశిస్తుతో పాటు మిగిలిన రాష్ట్రాలలో వసూలు చేస్తున్న ఎడ్యుకేషన్ సెస్సు వసూలు పూర్తిగా రద్దు చేయబడింది. ఈ విధంగా సామాన్య రైతాంగంపైన పన్నుభారాన్ని సాధ్యమైనంత

వరకు తగ్గిస్తూ బడ్జట్ లోటును పూడ్చేందుకు టీ, కాఫీ, రబ్బరు మున్నగు గుత్తపెట్టుబడిదారీ కంపెనీలకు వచ్చే వ్యవసాయా దాయాలపై సూపర్ టాక్సు పెంచబడింది. రు. 25,000 లకు పైబడిన ఆదాయాలపై రూపాయికి అణాచొప్పున ప్రారంభమై పదిలక్షలకు పైబడ్డ ఆదాయాలపై రూపాయికి పావలా చొప్పున సూపర్ టాక్సు విధించబడింది. అదేవిధంగా రెండు లక్షల రూపాయల విలువకు పైబడిన వ్యావసాయిక ఆస్థుల పైన వ్యవసాయ సంపదపన్ను, పైనచెప్పిన రెండుపన్నులపైనా నూటికి 5 వంతులు సర్ ఛార్జి విధించబడ్డాయి.

ప్రస్తుత వ్యవసాయక్షేత్రాలకు సీలింగువిధిస్తూ అక్రమ అన్యాక్రాంతాలను రద్దుచేస్తూ ఒకబిల్లు ప్రకటించబడింది. ప్రస్తుతం సెలెక్టుకమిటీ దశలో ఉంది. ఈ బిల్లు ప్రకారం రెండు పంటలు పండే మాగాణి భూములైతే 15 ఎకరాలు, ఒక పంటపండే మాగాణి భూములైతే 22½ ఎకరాలు, యితర భూములైతే 30 ఎకరాలు సీలింగుగా సూచించబడింది. కొద్ది మార్పులతో యీ బిల్లు త్వరలోనే చట్టం కాబోతూంది.

ఈ విధంగా కమ్యూనిష్టుల నాయకత్వాన గల కేరళ ప్రభుత్వం (ఎన్ని అడ్డంకులున్నప్పటికి) తానుచేసిన వాగ్దానా లను అమలుజరుపుటకు భూస్వాముల ప్రాబల్యంలోగల యితర రాష్ట్రప్రభుత్వాలు తమ వాగ్దానాల నమలుజరుపక పోవుటకు గల కారణాలను విజ్ఞులు పరిశీలించగలరని ఆశిస్తున్నాను.

సమాప్తం.